# ఏయ్, తొంగి చూడవాకు!

ఇది ప్రేమ లేఖ
ఎవరికీ చెప్పమని
మాటిస్తే మిమ్మల్ని
దీనిని చదవ
నిస్తాము

మన్నించండి!
అంతరంగిక
విషయాలు
ఉండటం వల్ల
వెల్లడి చేయటానికి
వీలులేదు.

ప్రియతమా,

మన వివాహం ఇంకా 3 వారాలే ఉంది. నా ఆనందానికి అంతే లేదు! కాని, కాలం మాత్రం నత్త నడక నడుస్తున్నది — నిమిషం గడవటం గంటలు గడిచి నట్లుంది. సరేగాని,

మన పడక గదికి ఒక వార్డ్ రోబ్ ఏర్పాటుచేద్దామని అనుకుంటుండే వాడివి గుర్తుందా? హోమ్ మేకర్, ట్విన్లాక్ అని రెండు చందన్ వార్డ్ రోబ్ లను నిన్న చూశాను. అవి చూడటానికి ముద్దొస్తున్నాయి. చాలా అందంగా ఉన్నాయి.

అవి చాలా గట్టిగా, అనుకూలంగా కూడా ఉన్నాయి. లోపల కుప్పలు తిప్పలుగా జాగా ఉంది — నా నగల కోసం చిన్న లాకర్ కూడా ఉంది (మన ప్రేమ లేఖలకు కూడా!)

హోమ్ మేకర్:
14 రకాలలో దొరుకుతాయి
ట్విన్లాక్:
6 రకాలలో దొరుకుతాయి



చందన్ — అందమైన అన్నిరకాల స్టీల్ ఫర్నిచర్ మరియు ఉపకరణముల కోసం

చందన్ మెటల్ ప్రోడక్ట్స్ ప్రైవేట్ లి గోర్వా రోడ్, బరోడా-3

అన్ని ముఖ్య కేంద్రములలోను ఆథరైజ్డ్ డీలర్లు కలరు

# అతి సుందరమైన, ముక్తామయ ముఖవిలాసము
# లక్మే వ్యానిషింగ్ క్రీమ్‌తో సాధ్యము




లక్మే వ్యానిషింగ్ క్రీమ్ విచిత్ర ముత్యపు కాంతిని సంతరించుకొన్నది. దాని మౌక్తికరణ దక్ష వెంటనే ముఖము మీద మెరుగును, మచ్చలను నునుపు చేస్తుంది. మీరు సహజ సౌందర్యంగ కనబడేటట్లు చేస్తుంది.

ముక్తామయ లక్మే వ్యానిషింగ్ క్రీమ్ ముఖమంత రాసుకోండి. తరువాత, దానిమీద లక్మే ఫేస్ పౌడరు కొద్దిగ అద్దుకోండి. అది ఎంత చక్కగా పనిచేస్తుందో చూడండి. ఈరోజే.

**లక్మే**
**వ్యానిషింగ్ క్రీమ్**

పి. యస్. నారాయణగారి "పారిపోయిన చిలక" స్వప్నానికి—అంటే ఈనాడు సంఘటితమైన సమాజ వాతావరణానికి, ఆ సమాజంలో నివసిస్తున్న వారి విభిన్న మనఃప్రవృత్తులకి ప్రతిబింబంగా వుందనడంలో ఎటువంటి అతిశయోక్తి లేదేమో!

అయితే మరొక్క విషయం— కథారంభంలోనే 'రాజ్యం' తాతగారితో తన మనుకారంలో పంచుతున్న చిలక ఎగిరిపోయిన సంగతి వెల్లడి చేస్తుంది. తాతగారు రెట్టించి ప్రశ్నించగా ఆ చిలకని పూర్ణచంద్రరావుగారు వదిలేసినట్లున్నారు'—అని జవాబిస్తుంది. ఇందులో ఒక విషయం ఎంతైనా ఆలోచించాల్సిన అగత్యం వుంది. ఎంతైనా తను [రాజ్యం] కూతురై తండ్రిని పేరుపెట్టి సంబోధించడం వాస్తవానికి దగ్గరగా వుందంటారా?— అసలు అలా జరగడానికి ఆస్కారం వుందంటారా? అంతకన్నా తండ్రిని 'నాన్న'—అని సంబోధించవచ్చుకదా! ఒక విధంగా ఈ సందర్భంగా వాస్తవానికి దూరంగానే కాకుండా పేలవంగ కూడా వుందనే చెప్పాలి. రచయిత ఈ సందర్భాన్ని ఏ అర్థం అన్వయించుకొని ప్రయోగించారో పత్రికాముఖంగా వెల్లడి చేస్తే బాగుంటుంది. అంతకుమించి కథలో ఎటువంటి అసందర్భాలు అగుపించలేదు.

శ్రీమతి 'రాధారాఘవ్' గారి 'తల్లి—కొడుకు' బాగానే వుంది. [ఇదే ఇతివృత్తాన్ని ఆధారం చేసుకొని అనేక రచనలు వెలువడినా] కథా సంవిధానంలో, పాత్ర చిత్రణా విధానంలో గొప్ప వైవిధ్యం కనబరిచారు. తన సంతానం దూరంగా వుండడం తండ్రి సహించగలడేమో కానీ నవమాసాలు మోసి మాతృత్వాన్ని పంచి యిచ్చిన మాతృమూర్తి మాత్రం పొంగి వచ్చే ఆవేదన్ని నిగ్రహించుకోలేదనే నగ్నసత్యాన్ని శకుంతల పాత్రద్వారా వెల్లడి చేసిన రచయిత్రి కృషి అభినందనీయం.

'మాడపీలత', కామారెడ్డి].

* * *

27—3—70 సంచికలో కె. రామలింగయ్య గారు 'తుఫాను' కథను విమర్శిస్తూ తన పుత్రరత్నం పోలీసు దుర్వాక్రమణ వలన చనిపోయాడని, ఆ సమయంలో ఈ కథ చదవడం వలన తన రక్తము పొంగిందని అన్నారు. ఈ కథ రంగాచారివంటి తెలంగాణా నేతలపై జరిగిన దుర్వ్యాపారాన్ని తెలియచేస్తుంది గాని తెలంగాణాలో జరిగిందని చెప్పబడుచున్న 'పోలీసుదుర్వాక్రమణ'ను సమర్థించలేదు గదా. తెలంగాణనేతలకు కూడా కనీసం సమానంగా వున్న ప్రేమించే తండ్రులు, తల్లులు వుండవన్నారనుకున్నారా! బస్సులను స్టేషన్‌గా తగుల బెట్టే ఆ రోజులలో పోలీసుల చర్య దుర్వాక్రమణగా కనిపించవచ్చు. ఒకవేళ వారి కుమారుడు తన దారిన తాను పోతున్నప్పుడు చంపబడితే మనమూ విచారిద్దాం. గుంపును చెల్లాచెదురు చేయు సందర్భంలో అమాయకులు కూడా దెబ్బలు తినడం సహజమే గదా. పోలీసులు కూడా మనుష్యులే. వారికీ కొడుకులుంటారు.

వె. పురుషోత్తం, [గుంటూరు.]

# ఉత్తరాలు

## సీరియల్

'అపరాజిత' సీరియల్ చాలా బాగుంటున్నాది. కథాగమనము సంభాషణము చాలా చక్కగా వర్ణిస్తున్నారు. నాకు సంతోషం.

యం. నిశాకర్‌రెడ్డి, [కరీంనగర్].

## ముఖచిత్రం

1—5—70వ తేదీ ఆంధ్రసచిత్రవారపత్రిక ముఖచిత్రం భలేపసలో బేగిరాణి భలేగ వుంది. పెద్ద తారల చిత్రాలు ముఖచిత్రాలుగా వేస్తూ, మధ్య మధ్య చిన్న తారల చిత్రాలు కూడ ముఖచిత్రాలుగా వేస్తే బాగుంటుంది.

—గుండుమళ్ళ వెంకటరామారావు, [భువనేశ్వర్].

## వ్యాసాలు

మార్చి 27 పత్రికలో ప్రచురించిన కామారి రాజేందర్‌గారి వుత్తరం చూసి నాకు [పత్రికకు] ఈ వుత్తరం వ్రాయాలనిపించింది.

ఎక్కినవాడికి ఏనుగు కురుచట [పొట్టి] అనే సామెత ననుసరించి మనరాష్ట్రంలో టిక్కట్లు ఎప్పుడైనా కొనవచ్చు బహుమతులెప్పుడైనా బడయవచ్చు— అనే వుద్దేశంతో పరరాష్ట్ర టిక్కట్ల కోసం ప్రాకులాడుతున్నారు మనలోని చాలమంది ప్రబుద్ధులు. దానికి తోడు 'పొరుగింటి పుల్లకూర. . . .' అన్న సామెత వుండనే వుంది. కాని అసలు విషయం రాజేందర్‌గారు చెప్పినట్లు రాష్ట్ర ప్రభుత్వకార్యాలయాలు, చిన్నా పెద పాఠశాలలు లాటరీ టిక్కట్ల విక్రయశాలలుగా మారడం మన రాష్ట్ర టిక్కట్ల అమ్మకం పడిపోయింది. ముఖ్యమైన మరో కారణం డ్రా దేట్లు ఊసరవిల్లి రంగులు మార్చినట్లు మార్చడమే. ముఖ్యకారణము. యుం కోటి— ఏదో కటాక్షం కాకుండా బహుమతి కోసం ఎదురు చూసి నిరాశ చెందిన—రెండవసారి ప్రయత్న లోపం—

టి. అప్పారావు, [విశాఖ].




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 15—5—'70
శ్రీ సాధారణనామ సం॥ వైశాఖ మా. శుద్ధ నవమి
సంపుటము : 63 సంచిక : 35

స్థాపితము
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి రమాప్రభ
(ఫోటో: కుసుమ్మోహన్, గీతామ్యాన్)


కథలు :

| | |
|---|---|
| నేను లేచిపోను | — 27 |
| వల | — 32 |
| దేముడు పిలిచాడు | — 49 |

సీరియల్ నవలలు:

| | |
|---|---|
| మమత | — 16 |
| అపరాజిత | — 44 |

వ్యాసాలు, శీర్షికలు, సినిమా:

ఉత్తరాలు — 2, ఈవారం కార్టూన్ — 5, మ్యాథిల్లీశే 6, బ్రహ్మాండకథామంజరి కథలు- 8, డాక్టర్ కబుర్లు -10, ఒకవారం వివరీతం -12, అన్నానికి బదులు—13, ప్రశ్నావళి—14, లాటరీయం (కార్టూన్) — 15, దంపతి రాజ్యం—21, నేడే ఉగాది (గేయం)— 23, వారఫలం — 31, ధర్మపథం — 43, గ్రంథ పరీక్ష — 56, సినిమా — 57, సినీ బా ౙరి—58, ఆఫీ —షీ, మీకు తెలుసా—63, పుస్తకాలు— 64.


మాకూ అంతరాత్మ వుంది
అమ్.సి.ఎస్.బిల్లు వోటు చేయడానికి కాంగ్రెస్‌వారి తిరస్కారం
నీ మాట వినకపోతే ఏంచేస్తావ్?
హైదరాబాద్ కార్పొరేషన్
అపాయంలో వున్న ఇస్లాం ముస్లింలీగని పునర్నిర్మించాలి.
?
చెలరేగుతున్న కల్లోలం
నక్సలైట్ బెడద (నిన్న)
నక్సలైట్ బెడద (నేడు)

ఢిల్లీ దినపత్రిక కూడా రాసింది. దీనిని బట్టి ఈ సూచనకి తగినంత బలం ఉండవచ్చునని, ఊహించవచ్చు.

షా ఆలమ్ రాజ్యం ఢిల్లీ నుంచి పాలమ్ దాకా విస్తరించి ఉండేది. బహదూర్‌షా సామ్రాజ్యం ఎర్రకోటని దాటి లేదు.

విధి మనుష్యుల మారణాలతో ఆగదు. ఔరంగజేబు తన సోదరుడు దారా, అతని కొడుకుని చంపించి వారి శవాలని చాందినీ చవుక్‌లో ఊరేగించాడు. ఇది 1658లో. 1857లో బహదూర్‌షా ఇద్దరు కొడుకులూ తుపాకులకి బలి అయ్యారు. వారి శవాలని తీసుకువెళ్లి ఢిల్లీ దర్వాజా బయట ఒక ఇంటి మీద పడేశారు హంతకులు...

## ...1857

అసలు విషయానికి వస్తాను. బహదూర్‌షా రాజ్యాన్ని పునరుద్ధరించటానికి 1857 లో యుద్ధం జరిగింది. బహదూర్‌షా మాత్రం చల్లగా ఎర్రకోటనుంచి హుమయూన్ సమాధికి పారిపోయాడు. ఢిల్లీ పతనం అయిన తర్వాత అతను హడ్సన్ అనే బ్రిటిష్ ఆఫీసరు శరణు కోరాడు. ఆ ఆఫీసరు అతని ప్రాణాన్ని కాపాడతానని హామీ ఇచ్చాడు.

## పారిపోయిన చక్రవర్తి

బహదూర్‌షా తన ఆయుధాలని అతనికి సమర్పించాడు. అతను ఇచ్చిన ఖడ్గాలలో ఒకటి నాదిర్‌షాది. రెండవది జహంగీర్‌ది.

బహదూర్‌షా వయస్సు అప్పటికి ఎనభయి దాటింది. అతను పూర్తిగా తన భార్య జీనత్ మహల్ చెప్పుచేతల్లో ఉండేవాడు. చివరి రోజుల్లో గొడవ ఎందుకని పారిపోయిన వాడు.

ఇటువంటి బహదూర్‌షాని వేలు నెపోలియన్‌తో పోలుస్తున్నారు. నెపోలియన్ అవశేషాలని సెయింట్ హెలినా నుంచి తీసుకువచ్చారు.

అలాగ తీసుకురావటానికి బహదూర్‌షా అవశేషాలు ఎక్కడ ఉన్నాయి? అతని కళేబరాన్నయినా ఒక శవపేటికలో ఉంచారా?

ఒక వయిపు ఘాలిబ్ మందిరం ఒకటి కడుతున్నారు. మరొక వయిపు బహదూర్‌షా అవశేషాలని ఢిల్లీకి తీసుకు వస్తున్నారు. వారిద్దరూ మాట్లాడిన లేక రాసిన భాష మాత్రం నాశనం అవుతోంది— ఘాలిబ్ పద్యాలని కూడా హిందీలో ప్రచురిస్తారు..




(గత సంచిక తరువాయి)

ఆ వృద్ధురాలి స్థితి చూచి జీమూతవాహనుని మనస్సు కరిగింది. 'అమ్మా! ఎవరు నువ్వు? ఎందుకు ఈ బాధ? నీ పుత్రుని పరిత్రాణంకోసం ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఈ నిస్సారమయిన సంసారంలో పరోపకారం చేద్దామన్నా ఎక్కడ దొరుకుతుంది? నిరంతరం అపాయంలోవున్న ఈ కాయానికి పరోపకారమే సర్వస్వమైన సారం. పరులను అపాయాలనుంచి రక్షించడమనే పుణ్యానికి దేహం పరోపకారంవల్లనే పొత్రమవుతుంది.' అని శంఖచూడుని తల్లితో అన్నాడు.

ఆ వృద్ధురాలు ఇతడే గరుత్మంతుడేమోననుకుని భయంతో వణికిపోతూ, పుత్రుణ్ని దగ్గిరికి తీసుకొని, అతని ఎదుట సాగిలపడింది.

జీమూతవాహనుడు ఆమెకు ఊరట కలిగిస్తూ, 'అమ్మా, నేను గరుత్మంతుణ్ని కాను. నా దేహం అర్పించి, నీ పుత్రుణ్ని రక్షించడానికి వచ్చిన విద్యాధరుణ్ని' అని అన్నాడు.

అప్పుడు వృద్ధురాలు ఇలా అన్నది: 'నాయనా, అలా అయితే నీవు శంఖచూడుని కన్నా నాకు ఇష్టమయినవాడివి సుమా! నీ ఈ దేహం చాల సౌమ్యమయినది. దీనిని అనేక కల్పశతాలవరకు చల్లగా రక్షించుకో నాయనా.'

తల్లి ఇలా అంటుండగా, శంఖచూడుడు, ఇదంతా ఆశ్చర్యంగా వింటున్నవాడు, జీమూతవాహనునితో ఇలా అన్నాడు నవ్వుతూ, శిరస్సుమీద అంజలి ఘటించి—

'హే సత్వశాలీ, నిన్ను చూడడం అతి సంతోషకరం. అమృతం కురిపించే కిరణమయుడయిన పూర్ణచంద్రుడు ఎవరికి అనిష్టుడో చెప్పు. నీ ప్రాణాలు నాకోసం ఇవ్వడానికి సిద్ధపడుతున్నావు ఏమి పనియిది! గడ్డికోసం రత్నాలు వెచ్చించేవాడు ఎవరైనా వుంటాడా? ఈ భవసాగరంలో నాబోటివారు ఎందరు పుట్టడంలేదు! ఎందరు గిట్టడంలేదు. కౌస్తుభం వంటి నీ బోటివాడు మళ్లీ ఎక్కడైనా పుట్టాడా? చంద్రునివంటి నీ ముఖానికి తగినమాటే పలుకుతున్నావు. ఎంతో ఉజ్వలంగావున్న నీమాట జగదంధకారాన్ని పోగొడుతున్నది. నాకోసం ఒక పనిచేయి. నేను బలి అయిన తర్వాత నా వియోగంతో

నా తల్లి బాధపడుతుంది. ఆమెను కొంచెం ఊరటపరచు. ఇంతకుముందు నిన్ను నేను చూడలేదు. అయినా, సాధుపుంగవుడు మిత్ర బాంధవుడంటారు. అలాగే నీవూ నాకు బాంధవుడివి.'

నాగకుమారుడు తన కులోచిత మయినట్లు మాట్లాడగా జీమూతవాహనుడు ఇలా అన్నాడు :

'చెలికాడా, ఏమిటి విచిత్రంగా మాట్లాడుతావు? కులాలంకార మయిన నీవు లేనిది ఈ వృద్ధురాలు బ్రతుకుతుందా? పుత్రశోకమనేది తల్లులకు మహా దుఃఖం కదా! నీపైనే ఈమె తన ప్రాణాలు పెట్టుకుంది. ఈమెను కాపాడడంకోసం నిన్ను నీవు రక్షించుకోవయ్యా. నీ తల్లి, నీవూ బ్రతకడమనే రెండు పనులూ నా దేహంతో జరుగుతాయి. తెలివిగలవాడివి, ఆలోచించుకో.'

జీమూత వాహనుడు ఇలా అని శంఖచూడుని పాదాలపై పడ్డాడు. ఆ నిర్బంధానికి నాగకుమారుడు కలవరపడిపోయాడు. ఇలా అన్నాడు :

'నీవంటి వాని మాటను నావంటివారు విని వివేచించడమనే ప్రశ్నే లేదు. శంఖధవళమయిన శంఖపాల మహావంశం శంఖచూడుడనే నాతో సత్యభంగమయి కళంకితం కాకుండా వుండాలి. గరుడుడు వచ్చే వేళ అయింది. ప్రభో నీకు శుభమగుగాక! నేను వెళ్ళుతున్నాను. చంద్రశేఖరుడయిన గోకర్ణేశ్వరునికి నమస్కరించి వధ్యశైలానికి వెళ్ళుతున్నాను.'

ఇలా అని, తల్లి అనుమతి తీసుకొని, నాగకుమారుడు వెళ్ళిపోయాడు.

ఆ క్షణమే, అకస్మాత్తుగా పెనుగాలివీచి జగమంతా వ్యాకులమయిపోయింది. కాలుని భుజాలలాగా దూరప్రాంతాలకు ప్రసరిస్తూ, శంఖాదుల కాంతులతో దిక్పటాలను అందుకుంటూ, మకరాది జలజంతువులతో కరాళమయిన సముద్రం తరగలు పైకి లేచాయి. అప్పుడు, చండకిరణుని కాంతికి ప్రతిఫలించిన మేరుపర్వతం కాంతులు వ్యాపించినట్లు, బడబాగ్ని వ్యాపించినట్లు ప్రదేశమంతా ఎర్రబారిపోయింది.

ఆ కాంతికి, ఆ గాలికి గరుత్మంతుడు వచ్చాడని గ్రహించి జీమూతవాహనుడు సంతోషంతో వధ్యశిలను ఎక్కాడు. ఎర్రటి గుడ్డ కప్పుకొని, నిలబడ్డాడు. 'నాకు ప్రాణి మాత్రోపకారంకోసం పునర్జన్మ కలుగుగాక!' అని కోరుకున్నాడు.

అప్పుడు అతనికి ఆకాశంలో దిక్కులను కాల్చివేసే భయంకర కాంతితోను, ప్రళయాగ్నిని విసురుతున్నట్లుగా రెక్కలు కొట్టుకుంటూ పక్షిరాజయిన గరుత్మంతుడు కనిపించాడు. అతని తీవ్రవేగానికి ప్రళయకాల మేఘాలు ఒకదానికొకటి రాచుకుని భయంకరంగా గర్జించాయి. ఆ గర్జనలకు అకాలంలో ప్రళయం సంభవించిదనుకొని మల్లోకాలు గగ్గోలుపెట్టాయి.

అలా వచ్చిన గరుత్మంతుడు ఆ ధైర్యసాగరుడైన విద్యాధర శిరోమణి చూడారత్నమండిత కిరీటాన్ని కాలిగోళ్ళతో లాగి పారేశాడు. తర్వాత అతని శరీరాన్ని చంచువుతో పట్టుకొని ఆకాశంలోనే గుండ్రంగా పెక్కుసార్లు తిరిగాడు. రంపాలవంటి అతని చంచువుతో లాగిన కిరీటంలోని చూడారత్నం రక్తధారతో సహా చంచువునుంచి, తన నివాసంలో విశ్రాంతి తీసుకుంటున్న మలయవతి ఒడిలో పడింది.

మలయవతి ఆ చూడారత్నం చూచింది. పిడుగుపడిన దిరిసెన చెట్టులా రెమ్మవలె అయిపోయింది. భయంతో మామగారు జీమూతకేతువు వద్దకు వెళ్ళి తెలియజేసింది.

జీమూతకేతువు తన విద్యాధర విద్యతో తనకుమారుడి ప్రాణాపాయం తెలుసుకొని, భార్య తోడు వెంటరాగా ఆ సువర్ణుడు నాగకుమారుడిని వధించే వధ్యశిల వద్దకు పరుగెత్తాడు.

ఇది ఇలా వుండగా శంఖచూడుడు సముద్రతీరంలో గోకర్ణేశ్వరునికి నమస్కరించి, మనోవేగంతో ఆ ప్రాంతం చేరాడు. గరుత్మంతుడు కాలిగోళ్ళతో జీమూతవాహనుని కిరీటాన్ని లాగి పారవేసి, అతనిని పట్టుకుని ఆకాశానికి ఎగిసిపోయి, మండలాకారంగా తిరుగుతూ వుండడం అక్కడ కనబడింది. గరుత్మంతుడు విద్యాధర రాజకుమారుణ్ని తన చంచువులతో నిరాఘాటంగా చీల్చడం చూచాడు. అతని మరణానికి తనే కారణమని విలపించాడు.

'హా సత్త్వవిపులుడా, ధైర్య గాంభీర్యౌదార్య సాగరుడా, అపూర్వ కరుణానిధీ, నిష్కారణబంధూ,' అని విలపించి, పరిత్యాగం చేద్దామనే దృఢనిశ్చయ అపాయమయినా సరే, గరుత్మంతుడిని [illegible] రించదలచి అటు వెళ్ళాడు.

గరుత్మంతుడు ఆకాశంలో జీమూ[illegible] వాహనుణ్ని రుచి చూచాడు. అ[illegible] ఎలాటి సంరంభమూ, తొట్రుపాటూ వుండడం చూచి ఆశ్చర్యపడి ఇలా [illegible]చించాడు :

'ఆహా! ఏమిటి ఆశ్చర్యం! [illegible]డెవడో ధైర్యసాగరుడు. సత్త్వవం[illegible] నేను ఇతనిని పొడిచి తింటూంటే, అంగాలు పులకిస్తున్నాయి. మాత్రమే మిగిలిన ముఖం ప్రసన్న[illegible] వుంది!'

గరుడి ఇలా ఆలోచించి ఎవరో [illegible]క్కొందామని 'ఎవరు నీవు?' అని ప్ర[illegible]చాడు.

'ఆ సంగతి నీకెందుకు? నీపని కానీ, నన్ను భక్షించు' అన్నాడు జీమూత వాహనుడు.

ఇంతలో శంఖచూడుడు అక్కడికి [illegible] చేరాడు. 'హా తార్క్ష్యా, కనిపించడం [illegible] సాహసం చేయకు. అతడు విద్యాధ[illegible]రుడు. ఆయన రొమ్ముమీద స్వ[illegible]ముద్రను చూడు. నీకు భక్ష్యమ[illegible] నాగుణ్ని నేను. చూడు నా రెండు [illegible]కలు. విషం కక్కే నాఫూత్కారం, [illegible] మండితమయిన నా పడగలు చూడు.' బిగ్గరగా అన్నాడు.

గరుత్మంతుడు అది చూచి వ్యాకుల[illegible] జీమూతవాహనుణ్ని వదలి పెట్టా[illegible] నాగకుమారుణ్ని చూచాడు. అ[illegible] ఏమీ తోచలేదు.

అప్పుడు జీమూత వాహను[illegible] 'గరుత్మంతుడా ఎందుకు నన్ను వ[illegible]పెట్టావు? ఎందుకు దూరంగా [illegible]బడ్డావు. ఇంకా నా దేహంలో [illegible] మాంసాలున్నాయి. నీకింకా తృప్తి [illegible]నట్టు లేదు.' అంటూ తన విశాలమం[illegible] రొమ్ము విరుచుకొని ముందుకు శరీ[illegible] చాచి నిలబడ్డాడు, 'నన్ను భక్షిం[illegible] నన్ను భక్షించు' అని మళ్ళీ మ[illegible] అంటూ.

గరుడి ఆ సింహ మాత్రావశి[illegible]డయిన జీమూత వాహనుడిని వ[illegible]

...డు. ఇంతలో జీమూతవాహనుని తన అత్తమామలతో వచ్చింది.

...ప్రాణావశేషుడుగా వున్న తన ...నాథుని చూచింది, మలయవతి. ...వ్య శోకాగ్ని ధూమంతో చీకట్లు ...మూర్చపోయింది. జీమూతకేతువు, భార్య తనకుమారుణ్ణి ఆ పరిస్థితిలో ...రు. తండ్రి మొదలు నరికిన ...వృక్షంలాగా కూలిపోయాడు. గరుడుడు పశ్చాత్తప్తుడై వారందరిని ...శ్వాస పరుస్తుండగా, జీమూతవాహ... తల్లి, తన కుమారుని శరీరాన్ని చేతితో తాకి, దీనంగా దుఃఖిం...

...క ఒకక్షణంలో మరణిస్తున్నప్పటికీ, ...తవాహనుడు తల్లితో నెమ్మదిగా ...అన్నాడు:— 'అమ్మా, ఈ నశ్వర...న శరీరంకోసం ఎందుకు ఏడు...? గాలికి లేచిన నీటితరగ కొంత

# ...బృహత్కథామంజరి

సేపటికి పడిపోయేలాగ భంగురమయిన ఈ పుట్టుకలో పుణ్యవశాత్తు ఇతరులకోసం జీవితం వ్యయపరచే అవకాశం కలుగుతుంది.'

ఇలా అంటూ, అతడు ప్రాణాలు వదిలాడు. అయినా, అతని ముఖంకాంతి తరగలేదు. అపారశోకాంధకారంతో జగత్తును నింపివేశాడా అన్నట్టుగా కన్నుమూశాడు.

మలయవతి పతితో పాటు మరణించడానికి నిశ్చయించింది. ఆమె దుఃఖంతో కొయ్యబారిపోయి నడవలేక పోయింది, కింద పడనూ లేకపోయింది.

అప్పుడు భక్తవత్సల అయిన గౌరీదేవి ప్రత్యక్షమై మలయవతిని సమాశ్వాసపరిచి, అమృతపు సోనలతో, ఆమె భర్త జీమూతవాహనుణ్ని జీవింప జేసింది. అతనికి చక్రవర్తి సంపదను ప్రసాదించి, వెంటనే అంతర్ధానమయింది.

అప్పుడు దేవతలు గంధర్వులతో పాటు వచ్చి, జీమూతవాహనుని సత్వగుణాన్ని ప్రశంసించారు. గరుడుడుకూడా సంతోషించాడు. ఏమి వరం కావాలో కోరుకొమ్మని జీమూతవాహనుణ్ని కోరాడు. 'సమస్త నాగులకు పుణ్యమయిన అభయ వరం ఇవ్వు మహానుభావా!' అని కోరాడు. జీమూతవాహనుడు అంతకుముందు హతులయిన పన్నగేంద్రులను కూడా బతికించడానికి వరం కోరి కృతార్థుడయ్యాడు.

గౌరీదేవి వరం ప్రకారం చక్రవర్తి సంపద పొంది, హిమవన్నగ శిఖరంమీది కాంచనంచేరి, తన పైతృకమయిన రాజ్యం పొంది, తలిదండ్రులతోను, ప్రియురాలయిన మలయవతితోను సుఖంగా వున్నాడు.

బేతాలుడు ఈ కథ చెప్పి, 'మహారాజా, శంఖచూడ జీమూతవాహనులలో సత్వవంతుడు ఎవడు?' అని ప్రశ్నించాడు.

'శంఖచూడుడే సత్వగుణానికి పుట్టినిల్లు. బాలుడయినప్పటికీ, గొప్ప మనస్సు గలవాడు గనుక, తన ఉచిత ధర్మంనుండి కదల లేదు. జీమూతవాహనుడు బోధిసత్త్వుడు. అతడు పూర్వం పెక్కుసార్లు తన దేహం దానం చేశాడు. కనుక తనను దానం చేసుకొనడం అతనికి అద్భుతమేమీ కాదు. తీవ్రమయిన తపస్సు, శుభ్రమయిన యశస్సు, శ్లాఘ్యమయిన సిరి, అద్భుతమయిన సత్త్వం, నిర్వ్యాజమయిన దానగుణం, మానవులకు పూర్వజన్మాభ్యాసంవల్ల కలుగుతాయి.'

బేతాలుడు రాజు మాటలు విని అదృశ్యుడయిపోయి, తిరిగి శింశుపా వృక్షంమీద ఆ కంఠపాశంతోనే కనిపించాడు.

(ఇంకా వుంది)

డాక్టర్ కబుర్లు

## పంటిలో లోపం — తలనొప్పి

తలపక్క భాగాలలో ఆగకుండా తలనొప్పి వస్తే దంతవైద్యుడిని చూడటం అవసరం!

ఒక ఆమెకి 10 సంవత్స...



[illegible]

...లుగా కుడి కణత వద్ద నొప్పిగా ఉండేది. ఈ బాధ మరీ అధికం అయి ఆమెకి వికారం, వాంతికూడా వచ్చేవి. ఆమెకి అన్నిరకాల చికిత్సలూ చేశారు.

ఎక్స్-రేల వల్ల రెండు పళ్లలోపల సూక్ష్మ విషక్రిమి బాధ ఉందని తెలిసింది. వాటిని తీసివేశారు. వెంటనే తలనొప్పి ఆగిపోయింది. మళ్లీ రాలేదు!

ఈరకం నొప్పి—పన్ను విషక్రిములవల్ల చెడిపోతూ ఉంటే—రాత్రి ఎక్కువ అవుతూ ఉంటుంది. వేడి పానీయాలవల్ల ఎక్కువ అవుతుంది. చల్లని పానీయాలవల్ల తగ్గుతుంది.

పళ్లు తలలో ఉంటాయి కాబట్టి అన్ని బాధలూ వెంటనే తెలుస్తాయి!

(కాపీరయిటు)

# లాటరీయం

సుబ్బారావు


జయలక్ష్మీ లాటరీ టికెట్ల షాపు
గురూగారూ! నా కమిషన్‌లో కొంత నీకిస్తాగానీ... వచ్చిన వాళ్ళందరికీ.. లాటరీ వస్తుందని చెప్పు!!
అన్నిరాష్ట్రాల లాటరీ టిక్కెట్లు అమ్మబడును


మీ సిండికేట్ టిక్కెట్టుకి మూడువేలు వచ్చిందన్నారూ! మీకెంత యిచ్చారు?
ముప్పయి పైసలు!!


అప్పారావు ఈమధ్య పూలరంగడులా తిరుగుతున్నాడు! ఏమిటి- లాటరీ వచ్చిందా?
లేదు! లాటరీ టిక్కెట్లు అమ్ముతున్నాడు!


లాటరీ ఫలితాలు వచ్చేవరకూ నాకు ప్యూన్ ఉద్యోగం ఇప్పించండి సార్!.. బాబు!!


ఏం జరిగింది?
లాటరీలో ఫస్టుప్రైజు వచ్చిందని ఊరికే.. కొంటా! టికెట్టు ఇవ్వమని బావ బాదేరు.. బాబోయ్...


లాటరీ హౌస్
అన్ని రకాల లాటరీ టిక్కెట్లు దొరుకును.
ఇందులో కూడా మనం వెనకపడ్డాం గురూగారూ!
తమిళనాడు లాటరీ 2 రూపాయల టిక్కెట్టు 2-30 మాత్రమే! త్వరపడండి!
ఆంధ్ర లాటరీ రూపాయి టిక్కెట్లు 80 పైసలే!

దాయాన్ని పారవశ్యంగా అంది పుచ్చుకున్న రాజయ్యగారు—

పడుపు కత్తెను తెచ్చి — ప్రత్యక్షంగా భార్య సమక్షంలో—ఉన్నయింట్లో కాపరం పెట్టడం వింత విడ్డూరంగా కనిపించినా—ఆయన్ను నిగ్గదీసి మందలించే శక్తి ఆప్తుల్లో ఎవరికీ లేకపోయింది. రంగాజమ్మ మంచి చెడ్డలతో లోకానికి పనిలేదు. అటువంటి పరిస్థితుల్లో బ్రతుకుతున్న మనిషి రక్తంలో మంచితనం బ్రతకలేదని ప్రపంచం నమ్ముతుంది. నమ్మింది. వైష్ణవ భక్తురాలైన రంగా



ఆమె — ప్రాతఃకాలాన లేచి తలనిండా స్నానంచేసి పట్టుచీర కట్టుకొని — శ్రీచూర్ణం నుదుటన ధరించి — వెండి పళ్ళెంలో కొబ్బరికాయలు పెట్టుకొని, దేవాలయానికి వెళ్ళటం గురించి ఊరు ఊరంతా గోలగా చెప్పుకున్నారు. దేవాలయం అర్చకులు మహదానందాచార్యుల వారుగాక — ఆమె భక్తిని మెచ్చుకున్న మనిషి, ఆవూళ్ళో లేకపోయాడు.

'ఆ భక్తి చూడండి —'

'ఆహా! ఒక పక్కన కొంపలు తీస్తూ —'

'జానుతే! భూషయ్య కొంపలు తీసిన కొద్దీ వంటిమీద పెట్టుకున్న నామాల సైజు పెంచుతున్నాడు చూడటంలా?' ఇదీ అదేబాపతు'

'నన్నడిగితే బావా!...' అంటూ రంగంమీదకు ప్రవేశించాడు కరణం గున్నేశ్వరరావు. ఆయన్నెవరూ అడగలేదు.

'ఇంత పాపానికి నడిగట్టుకుంటున్నదా? నరకానికి పోతుంది చూస్తూ వుండండి — ఆ రాజయ్య మాత్రం?' అప్పుడే వచ్చి రావిచెట్టు క్రింద బండలమీద చతికిలబడుతున్న భూషయ్యగారి భాష్యం అది.

ఆయాసపడుతూ కరణం గున్నేశ్వరరావు లేచాడు.

'పాపపుణ్యాల సంగతి అలా వుంచండి భూషయ్యగారూ. వేదాలూ ఉపనిషత్తులూ అలా పిండి కొట్టేశారు గదా? మీరు చెప్పండి? అసలు మోక్షమంటే ఏమిటండీ?

# మమత

చచ్చాక ఆ మోక్షం తగలబడకపోతే పోనివ్వండి. బ్రతికుండగా మోక్షద్వారాలు తెరుచు కున్నాయంటారా లేదా మన రాజయ్యకు, చెప్పండి? అవధానిగారు పురాణంలో ఎంతగా లొట్టలు వేస్తూ వర్ణించినా — సదరు రంభలూ మేనకలూ యింత కంటె తలకొట్టి మొలేశారంటారా? ఆవిడగారిపస — పదునూ చూసి చెప్పండి సమాధానం మరి?'

మళ్ళీ రక్తపు పోటులాంటిది వచ్చి కరణంగారివిలాకు హెచ్చింది. ఊపిరాడక మాట్లాడి మాట్లాడి రొప్పుకుంటూ యింటికి తేప్పుకొని పోయారు. రాత్రి నిద్ర పట్టలేదు కరణంగారికి. మూడు పుష్కరాల క్రితం, తన పెళ్ళిలో పేరు పొయిబ్బు పేరుగల సన్నాయి మేళం పెట్టించి — తమ దగ్గర డబ్బు గుంజి కూడా — తనను అవమానం చేసినప్పటి గర్వం రేగి — ఆ నాడు 'గుదిబండలా' మెడకి తగిలించుకున్న పెళ్ళాం కనకమ్మ గారి మీద కోపమొచ్చి తిట్టి అర్థరాత్రికి గురక పెట్టి — నిద్రలో కలవరించి, పలవరించి, తెల్లవారకుండానే నిద్ర లేచారు కరణంగారు. ఎన్నడూ లేనిది ప్రాతః కాలాన్నే తలారా స్నానం చేశారు ఆత్మ హత్య చేసుకుంటున్నంత భయపడుతూ చెరువులో మునిగి. ఇంటికి వస్తూనే తాళం చేయి కనిపించక బ్రద్దలుకొట్టి భోషాణం తెరిచి — పొదరు వాతలా పిబాది దట్టింది — భోషాణంలో చిరకాలంగా దాక్కున్న పట్టు బట్టలు తీసి 'పిటి అమ్మ కడుపుకాలా' అంటూ చిమ్మెట్లను తిట్టుకుంటూ కంతలు కనిపించకుండా కట్టి — ముక్కు పొడుం మరకలు లేని జరీ ఉత్తరీయం కప్పుకొని — గుడికి బయలుదేరారు కరణంగారు.

కనకమ్మగారు 'ఇన్నాళ్ళకు ఆయనకు భక్తి కుదిరింది. ఈ పొడుం మరక దిబ్బ చుట్టూ ప్రదక్షిణాలు చేయకుండా వుండేలా ఆయన మనస్సు మార్చు కన్న తండ్రీ' అంటూ కన్నయ్యను తలుచుకుని పుటుక్కున తుమ్మి — 'అశుభం' అనుకుంటూ భయపడింది.

అశుభమే జరిగింది కరణంగారికి.

రంగజమ్మ వెనకాతలే ఆలయ ప్రాంగణంలో అడుగు పెట్టారు కరణంగారు. స్వామి గర్భాలయం చుట్టూ ఆమె ప్రదక్షిణం చేస్తున్నది. 'గోవు వెంట పోను కోడె భంగి' — కరణంగారు కూడా ప్రదక్షిణాలు ప్రారంభించారు. అందరినుస్తున్న గుండెలను అదిమిపట్టుకొని — ధైర్యం కూడగట్టుకుంటానికి ఆయనకు రెండున్నర ప్రదక్షిణాల కాలం పట్టింది.

ఆ తర్వాత —

ఆలయం వెనకనున్న సందులోంచి రొప్పుకుంటూ బయటపడి — స్వామివారికి పూజాద్రవ్యాలు సమర్పించకుండానే ఎవరో తరుముతున్నట్టు పరుగులు తీస్తున్న కరణంగారిని చూసి 'అయ్యో! వెళ్ళిపోతున్నారే దర్శనం కాకుండానే' అంటూ కేక పెట్టారు అర్చకులు మహదానందాచార్యులవారు.

అప్పటికే కనుమాపుమేర దాటి పోయారు కరణంగారు.

'ఛీ! పాడుబుద్ధులు. అందులో స్వామి సమక్షంలో' అంటూ వచ్చిన రంగాజమ్మను చూసి 'కరణంగారని యింక రాజయ్యగారు బ్రతకనివ్వరు' అనుకుని సంబరపడ్డారు అర్చకులు.

గుండెదడ హెచ్చి కొత్తగావచ్చిన 'ఎల్ ఎమ్‌పి డాక్టరు' గారి దగ్గరకు వెళ్ళారు ఆ మధ్యాహ్నం కరణంగారు. కంగారులో వచ్చిన విషయం మరిచిపోయి — 'డాక్టరు గారూ! ఏభయ్యేళ్ళు వచ్చాయి ఆ దొ



వేయి
గులాబీల
సారం...

# బందీ గోద్రెజ్ నం.1లో చేయబడింది

గోద్రెజ్ నం.1 యొక్క మృదు మధురమైన గులాబీ పరిమళం, స్నానంచేసిన తరువాత, చాలా సేపు మీ వెనువెంట తారాడుతూ ఉంటుంది. మీగడ వంటిదాని పుష్కలమైన నురుగు మీచర్మాన్ని లాలిస్తుంది. దానిని అధిక సౌందర్యవంతం చేస్తుంది.




గోద్రెజ్ నం. 1 విస్తారమైన మన్నిక గల సౌందర్యపు సబ్బు.

Interpub: G. S. No. [illegible]

య్యకు ఏం పోయేకాలం చెప్పండి? ఈ వృద్ధాప్యంలో ఆ సానిదానితో కలిసి ఆ పచ్చిశృంగార మేమిటండి? ఇద్దరూ గవ్వలాడుతూ కూర్చుంటారట ఇరవై నాలుగు గంటలూ' అనేశాడు రొప్పుతూనే.

కరణంగారికి రహస్యంగా 'మాదిమందు' యిస్తున్న కాంపౌండరుద్వారా — అంతకు ముందే అసలుకథ విన్న డాక్టరుగారు నవ్వుతూ 'నలభయ్యేళ్లకు వృద్ధాప్య మేమిటండీ? దొరలదేశంలో అసలు కోడె వయస్సంటే నలభై దాటాకనే తెలుసా? ముప్పై అయిదేళ్లకే మీ కలా నడుం వంగి—తల ముగ్గుబుట్ట అయిపోయిం దంటే—ఊరి లిటిగేషనంతా బరువు విపరీతంగా మోయడమే కారణం. అలా రొప్పకూడదు సుమండీ — అది గుండెజబ్బు లక్షణం. ఆకుకూరలు రెండుపూటలా తింటూ, చ్యవనప్రాసలేహ్యం—ఐరన్ కలిపింది—ధారాళంగా వాడకపోతే మీ గుండె ఆగిపోగల దండోయ్' అంటూ ఓ సీసాడు లేహ్యమిచ్చి — అయిదున్నర రూపాయల రుసుం-కాంపౌండరుచేత వసూలు చేయించారు.

ఆ లేహ్యం సీసా చేతబట్టుకొని, ఆకుకూరల యజ్ఞం ప్రారంభించాలనే దృఢ సంకల్పంతో—బ్రతుకుమీద ఒక్కసారిగా వెల్లువాలిన మమకారం ముంచుకొచ్చి—కూరల నాగన్న కొట్టుకెళ్లి అరడజను రకాల ఆకుకూర లిమ్మంటూ ఆర్డరిచ్చారు కరణంగారు.

'రాజయ్య యిలా తెగించి—సానిదాన్ని సంసారాలు చేసుకుంటున్న కొంపల మధ్య పెట్టటం ఏమన్నా బావుందా నాగన్నా?' అంటూ పరామర్శించారు ఆ ఆసామీని ఉప్పూ కారం తింటున్న మనిషి గనక ఉక్రోషం పట్టలేక.

'ఊళ్లో చాలామంది చచ్చునాయాళ్ల కంటె ఆయనగారే నయమండీ? ఆహా! ఆయనగారిదండీ అసలైన చావంటే—నాకు నచ్చాడులెండి'

పోరంబోకు తగాదా యింకా లిటిగేషనులో వుందని తెలుసుండీ గూడా మనసులో ఉన్నమాట అనేశాడు నాగన్న.

రంగాజమ్మ గుళ్లో కరణంగారు చేసిన అఘాయిత్యం గురించి రాజయ్యగారికి చెప్పలేదు. మర్నాటినుంచి ఆలయానికి వెళ్లడం మానుకుంది.

కరణం గున్నేశ్వరరావుగారి కర్ణీక మహాత్మ్యం కేవలం కారణం కాకపోవచ్చు. ఏమైనా — అప్పుళ్లో — ఆయింట్లో ఉండలేకపోయింది రంగాజమ్మ. ఉన్న నెల రోజుల్లో ఆమె ఆరోగ్యం దిగజారింది. పల్చటి చెంపలు యింకా పల్చబడ్డాయి. సన్నటిమెడ యింకా సన్నబడింది. పెద్ద కళ్లు యింకా పెద్దవయ్యాయి.

'ఏమిటి రాజీ నీ బాధ?'—ఒకటికి పది సార్లు లాలనగా అడిగినా ప్రయోజనం లేకపోయింది రాజయ్యగారికి.

'మీరుండగా నాకు బాధేముందండీ' అంటూ బలవంతంగా నవ్వేది. గ్రామంలోని స్త్రీలంతా మాట్లాడితే మైలపడి పోతామన్నట్లు రంగాజమ్మనుగాదు — సీతమ్మగారిని కూడా తప్పించుకు తిరుగుతున్నారు. ఊళ్లో వాతావరణం ప్రతికూలమైన కొద్దీ — రాజయ్యగారికి ఆమెమీద మమకారం, లాలస, అధికం కావడం జరిగింది.

### వంటగది శుభ్రత

వంట చేస్తూనే వంట గది శుభ్రం చేసుకోవడం అలవాటు చేసుకోవాలి. అప్పుడే పని సులువు అవుతుంది. వంటంతా అయేదాకా అన్నీ పోగు చేస్తే—పని తడిసి మోపెడు అనిపిస్తుంది. ఎవరేనా చూడవచ్చినా సిగ్గుచేటు. వంట చేస్తూ శుభ్రం చేస్తూంటే—చివరికి తక్కువ పనే మిగిలి — శ్రమ అనిపించదు. వెల సులభమని చవక మూకుళ్లు అవి కొనుక్కుంటే పని అధికం. వాటికి పట్టే జిడ్డు అంటుకుపోయే పదార్థాలూ తోమేసరికి అవుతుంది. అంచేత శుభ్రమైన పోత మూకుళ్లూ, రెండు చెమ్చాలూ బలంగా ఉన్నవి కొనుక్కుంటే హాయి. నానమ్మలకాలపు ఇనపమూకుడు యీ రోజుల్లో దండగ.

ఏమైనా మద్రాసులో ఉంటున్న వాళ్ల పిన్నమ్మగారింటికి మకాం మార్చడం మంచిదని నిశ్చయించుకొని, చివరకు రాజయ్యగారిని కూడా ఒప్పించింది. ప్రయాణంనాడు ధర్మవరం పట్టుచీర కొనిపించి రంగాజమ్మకు పెట్టింది సీతమ్మగారు. ఆవిడ స్వయంగా వీధి గుమ్మం వరకూ వచ్చి సాగనంపుతున్న దృశ్యాన్ని కిటికీల సందుల్లోంచి నాటకం చూసినట్లు ఎగబడి చూశారు అమ్మలక్కలు. 'ఎంత సయోధ్యలో సవతుల మధ్య!' అని రకరకాలుగా వ్యాఖ్యానాలు సాగినై. రాజయ్యగారు కూడా రైలుస్టేషను దాకా బయలుదేరారు. బండిని, వీధి మలుపు దాటి పోయేవరకూ అలాగే చూస్తూ గుమ్మంలో నిలబడింది సీతమ్మగారు. బండిలో రాజయ్యగారి సరసన కూర్చున్న రంగాజమ్మ కూడా అలాగే రెప్పలార్పకుండా సీతమ్మగారి వంక చూస్తూ, బరువుగా నిట్టూర్చి 'ఏం జీవితం!' అనుకుంది అస్పష్టంగా కలవరిస్తున్నట్లు.

'ఏమిటి రాజీ?' అన్నారు లాలనగా రాజయ్యగారు.

'పాపిష్ఠిదాన్ని' అంది బరువుగా రంగాజమ్మ.

'ఎందుకని?'

'మీకు తెలీదా ఎందుకనో?'

తనకు కోరుకున్న జీవితాన్ని భగవంతుడివ్వలేదు.

ఆమె కళ్లు చెమ్మగిల్లాయి. 'ఆ యిల్లాలి ఉసురు నాకు తగులుతుంది' అనుకుంది. 'తన వస్తువు నేను హరిస్తున్నాను' అనిపించింది.

'ఎందుకలా బాధ పడతావు రాజీ — వెర్రిదానివి' అంటూ అరచేతిలోకి చేయి తీసుకుని మెత్తగా నొక్కారు రాజయ్యగారు.

'కాదండీ! ఆమె మనిషి కాదు'

'మరి?'

'దేవత'.

'ఎందుకో?'

'చల్లని తల్లిలా ఆశ్రయమిచ్చి—ఈ పాపిష్ఠిదాన్ని అంత ఆపేక్షగా కడుపులో పెట్టుకుందంటే — ఎటువంటి దేవత చెప్పండి? మహాసౌభాగ్యం కొల్లగొట్టాను. ఆ సౌభాగ్యానికి నోచుకోని శాపగ్రస్తురాం

మేము పుట్టుకలో. నాకు నా పుట్టుకే రోతనిపించింది. 'ఏడ్చాను. దొరగారినీ నన్నూ గదిలో పెట్టి తాళం పెట్టింది అమ్మ. 'భగవంతుడా' అంటూ గావుకేక పెట్టాను చివరకు. ఎందుకిచ్చావురా తండ్రీ ఈ జీవితం? ఎవరు కావాలన్నారు? పూర్వజన్మ ఉందో లేదో నాకు తెలియదు. ఈ జన్మలో ఏ పాపం చేశాను తండ్రీ—ఆశ్రయమిచ్చిన కడుపునే తొలిచివేస్తున్నదేమో ఈ కీటకం.'

కళ్ళల్లో గూడు కట్టుకున్న కన్నీరు బండి కుదుపుకు త్రుళ్ళిపడి—కట్టలు త్రెంచుకుని ప్రవహించ సాగింది. దుఃఖ భారంతో తల వంచుకుంది రంగాజమ్మ. బలమైన రాజయ్యగారి కాలిమీద చేయి వేసి వత్తింది—ప్రవాహంలో కొట్టుకు పోతున్న మనిషికి—ఏదో ఆధారం దొరికి నట్టు.

'ఏమిటి రాజీ?'

'ఎలా తీర్చుకోగలనండీ ఆదేవత ఋణం' అంటూ దీనంగా రాజయ్యగారి ముఖంలోకి చూసింది రంగాజమ్మ.

రైలుస్టేషన్ వచ్చింది.

* * *

రంగాజమ్మను మద్రాసులో దిగబెట్టి వచ్చిన రాజయ్యగారు — 'నీకు కొడుకు కావాలా—కూతురా?' అన్నారు భార్యతో.

విట్టూర్చింది సీతమ్మగారు.

అసలు విషయం చెప్పారు రాజయ్య గారు.

ఏడు నెలలలో పదహారుసార్లు జరిగింది రాజయ్యగారి మద్రాసు ప్రయాణం. ఎన్నడూ సీతమ్మగారు అభ్యంతరం చెప్ప లేదు. ఊళ్ళోకూడా ఈ విషయం పాత బడి పోయింది ఒకటికి పదిసార్లు చూసిన నాటకంలా—కాకపోతే సినిమాలా.

ఒకనాడు టెలిగ్రాం వచ్చింది మద్రాసు నుంచి 'సీరియస్' అంటూ. ఈ సారి భార్యను వెంటబెట్టుకుని బయలుదేరి వెళ్ళాడు రాజయ్యగారు. అంతా అయిపోయింది ఇంచుమించు అప్పటికే.

కవలపిల్లలను కంది రంగాజమ్మ. ■

అందుకోసమే పుట్టినట్టు—అకాలంగా ఆ యిద్దరు పిల్లలనూ పుణమితల్లికి అప్పగించి — రాజయ్యగారి జీవితం నుంచి శాశ్వతంగా తప్పుకుంది రంగాజమ్మ.

రంగులరాట్నం






# సముద్రగుర్రం

సముద్రగుర్రం నిజానికి గుర్రంకాదు. ఒక చేప. దాని తలకి గుర్రంతలకి ఆకారంలో పోలిక ఉండడంవల్ల ఈ పేరు.

ఒక అడుగు పొడవు ఉండే జాతులున్నాయి. కాని సాధారణంగా 4, 5 అంగుళాలు ఉంటాయి. అన్ని చేపలకి లాగా కాకుండా, దీని తల శరీరానికి లంబకోణంలో ఉండడంచేత గుర్రం ఆకారం బాగా కనబడుతుంది. ఈ చేప శరీరంమీద బలమైన కవచం ఉంగరాలరూపంలో ఉంది. ఏ చేపల్లోనూ కనబడని ప్రత్యేకత దీనితోకకి ఉంది. దీనితోక సముద్ర మొక్కలని చుట్టి, పట్టి ఉండగల్గుతుంది. వాజాలు క్షీణించిపోయాయి. వీపుమీద మాత్రం ఒకటి ఉంటుంది. దానితో సున్నితంగా, వింజామర మాదిరిగా విసురుకుంటూ, సుతారంగా కదులుతుంది. శత్రువుల నించి రక్షణకు దాని శరీరంపైని కవచమే ముఖ్యం. ఇంకా కొన్ని జాతుల్లో శరీరం అంచులు శాఖలుగా చీలి సముద్ర మొక్కలని బాగా పోలి ఉంటుంది. ఆ మొక్కల్లో వాటిగుర్తి చిక్కడం కష్టంగా ఉంటుంది.

సముద్రగుర్రం అన్ని చేపల్లాగా తన ఆహారాన్ని తినలేదు. నోరు గొట్టంమాదిరిగా ఉంటుంది. దానిలోకి చిన్నచిన్న జీవుల్ని పీల్చుకొంటుంది

సంతానం అంటే సాధారణంగా చేపలకి జాగ్రత్త లేదు. [కొన్ని జాతులు మంచి జాగ్రత తీసికొంటాయి] కాని సముద్ర గుర్రం చాలా జాగ్రత్త పడుతుంది. అందులోనూ మొగదానిదే ఈ బాధ్యత. మగ సముద్రగుర్రాలకి పొట్టక్రింద సంచి ఒకటి ఉంటుంది. ఆడది తన గుడ్లని మగదాని ఈ సంచిలో పెడ్తుంది. మగది వాటిని మోసుకుని తిరుగుతుంది. పిల్లలు, ఎదిగి అచ్చంగా పెద్దవాటి రూపంలో వస్తాయి. బయట తిరుగుతున్నపుడు ఏదైనా ప్రమాదం అని తోస్తే తిరిగి ఆ సంచిలోకి దూరిపోతాయి. అంత జాగ్రత్త పడతాయి. కాబట్టే గుడ్లు, పిల్లలు నాశనం కాక, పెద్దవయసులో శత్రువుల్నుంచి దూరంగా పారిపోలేకపోయినా, ఈ జాతి నాశనం కాకుండా ఉంది.

సముద్రగుర్రంకు దగ్గరదే "గొట్టం చేపలు" సన్నగా గొట్టంలాగే ఉంటాయి. కాని తల లంబకోణంలో ఉండదు. గుర్రం ఆకారం రాదు. తోక చుట్టుకో లేదు. ఈ జాతుల ఆడది రంగులతో ప్రస్ఫుటంగా కనబడినా మగది మాత్రం పుల్లలాగా కళావిహీనంగా ఉంటుంది. పుల్లల్లోనే నివసించడం వల్ల అసలు కనబడనే కనబడదు. పొరపాటున మన చెయ్యి దానిమీద పడినా, కదలదు, మెదలదు— నిజంగా పుల్లే అయినట్టు. పైగా ఇలా ప్రమాదం తోచినప్పుడు ఆడది నాట్యం చేసుకొంటూ దృష్టిని మగదానినుంచి తప్పించేస్తుంది. ఈ తాపత్రయం అంతా పిల్లల రక్షణకే, మగదాని సంచిలో పిల్లలు గ్రుడ్లు ఉంటాయికదా!

సముద్ర గుర్రాలు చాలా శతాబ్దాలనుండి మానవ నాగరికతకు తెలుసు. పురాతన మానవుడు గీచిన బొమ్మల్లో చాలచోట్ల ఇవి కనబడతాయి. అందమైన ఆభరణాలుగాను, అలంకారాలుగాను వీటిని వాడుకొంటారు. చైనావాళ్ళు సముద్రగుర్రాలని ఎండబెట్టి, పిండికొట్టి మందుల్లో వాడతారు. విచిత్రం ఏమంటే చైనావాళ్ళు ఇలా చాలా వాటి జంతు పదార్థాలని మందుగా వాడతారు

లకు హత్తుకునేది. కాలిపోతున్న చెంపకు చల్లని బుగ్గలు తోడయేవి. కన్నీళ్ళతో కడుగుతున్నట్లు, ముఖాన్ని పులుము కుంటూ తన బుగ్గలను ముద్దాడుతున్న రంగాజమ్మ స్వామికి గుర్తు.

అది తన భ్రమ కావచ్చు.

మమతలో కరిగిన మనస్సు, నిలుపు కుంటానికి ప్రయత్నిస్తున్న — మధుర స్వప్నం కావచ్చు.

'అమ్మా' అని పిలిచినప్పుడు చెంపలమీద చిటికవేసి — 'అలా పిలవ గూడదు బాబూ. 'పిన్ని అనాలి' అంటూ దీనంగా నిట్టూర్పులు విడిచేది, రంగాజమ్మ.

ఆనాడు—

రంగాజమ్మ చివరిసారి ఊపిరి పీల్చిన నాడు — భయపడుతూనే — తనను దగ్గరకు తీసుకుని — రెండు చేతులతో — తన తల్లి సీతమ్మగారికి అప్పగించి 'మీ బిడ్డ' అంది ఏడుస్తూ.

'ఎప్పుడు కాదన్నాను?' అంది సీతమ్మ గారు.

'ఇప్పుడు కాదనండి. నాకోసం — మీ కడుపున పుడతాను'

— ఈ దృశ్యం లీలగా గుర్తుంది స్వామికి యిన్నాళ్ళు గడిచినా — ఇన్నేళ్ళు నడిచినా. ఫలితంగా అనేక ప్రశ్నలు తనను చిరకాలంగా వేధిస్తున్నాయి. సమాధానం కోసం తల్లి సీతమ్మగారి నడిగే శక్తి తనకు లేకపోయింది. ఒంటె వరు మనస్సులోని చిక్కు ముడిని విడ దీయగలరో తనకు తెలియదు.

తనకు యింకా పూర్తిగా బుద్ధి తెలి యని కాలంలోనే, తండ్రి రాజయ్యగారు కూడా ఈ లోకం-వదిలిపోవడం జరిగింది. అది తన దురదృష్టం. 'వాడిని రాజాను చేస్తాను చూడవే' అనే వారాయన తల నిమురుతూ అంతులేని నమ్మకంతో. కాని జరిగిందేమిటి? రాజయ్యగారు పోయిన నాటిరాత్రి, ప్రాణత్యాగం చేయా లనే సంకల్పంలో దొడ్లో దిగుడు బావి దగ్గరకు నడిచి వెళ్తున్న తల్లికి — తానే అడ్డంపడ్డాడు. రెండు కాళ్ళనూ పట్టుకుని 'అమ్మా' అంటూ గావుకేక పెట్టాడు. ఆ పియసు ప్రేమానుబంధమై — ఈ లోకంలో తిరిగి నిల బెట్టింది సీతమ్మగారిని.

'నువ్వు నా బిడ్డవు—నా బిడ్డవు— కాదంటావా నాయనా?' అంటూ రోదిం చింది సీతమ్మగారు.

'కానమ్మా—అమ్మవు కదా?' అన్నాడు ఆమె కన్నీరు తుడుస్తూ.

'నీకోసం బ్రతుకుతానురా తండ్రీ! పసిప్రాణాన్ని ఎంత ఘోరం తలపెట్టాను నీకు?' అంటూ బిడ్డను గుండెలకు హత్తుకుని యింట్లోకి నడిచింది సీతమ్మ గారు.

రెండు ప్రాణుల్ని మాలిన్యంలేని మమ తలో ఏకం చేసిన గాథ సరిష్యంగమది. అలా రెండు ప్రాణులూ — ఒకరినుంచి ఒకరు బలాన్ని, ఊరటనూ అంది పుచ్చు కుంటూ ఆ రాత్రి జాగరణ చేశారు ఒకరికొకరు హత్తుకుపోయి. ఆమె చెంపలనుంచి జారి రాలిన వెచ్చటి కన్నీటి చుక్కలు, స్వామి తలపై టొటొ టొటొపాలటూ రాలి రాత్రిని కరి గించినై.

ఆ కన్నీటి రహస్యం ఆనాడు స్వామికి తెలియదు.

* * *

రాజయ్యగారు బ్రతికుంటే స్వామి జీవితం — ఎలా గడిచేదో ఈనాడు మనం ఊహించలేము. నిజంగానే కన్న కొడుకుని అందల మెక్కించాలని కలలు గన్నారు రాజయ్యగారు. ఆ కలల్ని పండించి, నిజం చేయడానికే ధాన్యం వ్యాపారం పెట్టటం జరిగింది.

'సొంతం దివాలా తియ్యటానికి మొదలు పెట్టాడయ్యా వ్యాపారమంటూ.'

ఈ మాట అన్నదెవరో కాదు. సాక్షాత్తూ రాజయ్యగారి బావమరది మంగపతి.

'ఇటువంటి దౌర్భాగ్యుడికిచ్చి నా చెల్లెలు గొంతు కోశాం.' అంటూ

# నేడే ఉగాది!

నీవె వచ్చితివి నా జీవిత నిధానమా!
నిజముగా నేడే సుమా, ఉగాది!
ఈ వేళ వత్తు నేనిక మాట తివ్వని
ఎన్నో విధాల కికురించినా వకట! మరి
రావు! నా బ్రతుకు సర్వమ్ము వమ్మయ్యెనని,
భావించితిని గాని, భ్రమ కాదు! కాదోహో,
జీవనాధారమా! నీవె వచ్చితి వింక
నిశ్చయ మ్మినాడె! నేడే ఉగాది!

గుండె తలుపెవ్వరో కొట్టి, మెల్లన బిలిచి,
పండె నీ భాగ్యమని పలికినటు కలగంటి!
కల యథార్థమ్మగునె? కల్లయే యనుకొంటి!
కన్నీట నీ బాట కలయంపి చల్లితిని.
కాసి, గర తరళ ముక్తాహార హీరమా!
నా నోము పంట! ధన్యమ్మయ్యె జన్మమే!
నీవె వచ్చితివిగద, జీవనప్రాణమా!
నిజము ముమ్మాటికిది, నేడే ఉగాది!

—వి. గణపతిశాస్త్రి

వాపోయాడు గూడా పదిమందికి చెప్పు కుంటూ.

కాని—

అందరూ అనుకున్నట్టూ ఆశించినట్టూ జరగలేదు. సంవత్సరం తిరిగేసరికి వ్యాపారం విపరీతంగా అందుకుంది. ఆ గ్రామంలో చిన్న కారెక్కిన ప్రతి మనిషినీ — సింహాసన మెక్కిన రాజాగారిని గౌరవించినట్లు గౌరవించేవారు, ఆ చిన్న కారు వివరితాలూకుదైనా సరే. బస్సు పర్మిట్లిచ్చే కమిటీలో మెంబరైన నాయుడుగారు అప్పుడప్పుడు చిన్నకార్లమీద దిగి యింట్లోకి పోవడం చూసిన తర్వాతనే ఆ ఊరి ప్రజ ఆయన ఘనతను హృదయపూర్వకంగా గుర్తించింది. అటువంటి గ్రామంలో ఒక జీపుకారు— సొంతంగా కొనేశారు రాజయ్యగారు

'పెద్దింటి రాజయ్య'గా పేరొందిన పెద్దమనిషికి 'జీపు రాజయ్య' అనే పేరు స్థిరపడి పోవడానికి ఆ జీపుకారేకారణం. ఆరిపోయాడు పెద్దమనిషి — అనుకున్న మరీ పెద్దమనుష్యులంతా — 'రాజయ్య కేమండీ? ఆయనగాదు మొదటినుంచీ మహారాజే' అనడం మొదలు పెట్టారు.

ఆ ఊళ్లో మొదటిసారి రేడియో పెట్టించింది రాజయ్యగారే. కుర్రకారులో మొదటిసారి మూడుచక్రాల సైకిలెక్కి తిరిగింది రాజయ్యగారి కొడుకే. 'రాజయ్య

# మమత

కథ' యింతగా మలుపు తిరుగుతుందని మంగపతి కల కనలేదు. ఆ జీపు కారు వల్ల రాజయ్యగారికీ, ఈ మూడు చక్రాల సైకిలువలన స్వామికీ, లోకంలో అంతులేని గౌరవం పెరిగిన మాట నిజం.

ఈ సందర్భంలో మంగపతిభార్య గర్భవతి అయింది. తాలూకా కచ్చేరీకి వెళ్లి తిరిగివస్తూ ఒకానొక శుభముహూర్తాన మంగపతి స్వయంగా—జరిగిపోయిన వన్నీ మరిచిపోవడం ఉభయులకూ ధర్మం — అనుకుంటూ రాజయ్యగారి యింట్లో— ఐదుసంవత్సరాల విరామం తర్వాత మళ్లీ అడుగుపెట్టటం జరిగింది!.

'ఏం బావా! యిప్పటికి దయ కలిగిందా?' అంటూ ధాన్యం నలుపుతూనే బావమరిదిని పరామర్శించారు రాజయ్యగారు,

పశ్చాత్తాపంతో కుంగిపోతున్నట్లు పాలిపోయిన మంగపతి తలవంచుకుని — 'అన్నివిధాలా పెద్దవాడివి. మేం తప్పులు చేస్తే, క్షమించి నువ్వు కడుపులో పెట్టుకోకపోతే—' అంటూ అస్పష్టంగా 'చివరి మాటలు మింగేసిన మంగపతి భుజం మీద బిగ్గరగా నవ్వుతూ చరిచి 'మొత్తానికి కర్ణాని వనిపించావు. నే నెంత పెద్దవాణ్ణో నీకు తెలియకనా?' అంటూ



వాకాళం పట్టించారు రాజయ్యగారు:

కాంపౌండులో ఆగిన పది పన్నెండు లారీలనూ, రాసులుగా నిలిచిన ధాన్యాన్నీ ప్రత్యక్షంగా చూసిన మంగపతికి, రాజయ్యగారి పెద్దరికం విషయంలో అవంత అనుమానం రాలేదు.

'బావా! అంతకుముందు బిజినెస్‌లో రవ్వంతకూడా అనుభవం లేనివాడివిగదా? ఎలా నెట్టుకొస్తున్నావయ్యా బాబూ ఇంత వ్యాపారం?' అని అడిగి రాజయ్యగారి సమాధానం కోసం, అలనాడు శ్రీకృష్ణపరమాత్మ 'ఉవాచ' కు భక్తి శ్రద్ధలతో నిరీక్షిస్తున్న అర్జునుడి ఫక్కీలో నిలబడ్డాడు మంగపతి—ఇనప పెట్టెలోని నోట్లకట్టలను తేరిపార చూస్తూ వినమ్రుడై.

అదొక సృష్టి రహస్యంలా దాచి సమాధానంగా నిండైన చిరునవ్వు చిందించి—ధాన్యం తాలూకు డబ్బు— 'వేలకట్టలు' రైతులకు పంచిపెట్టటం మొదలుపెట్టారు. ఆ మాత్రం చిరునవ్వుకే సంతృప్తిపడిన మంగపతి 'ఇదంతా నా అల్లుడి అదృష్టం' అంటూ సంబరపడిపోయి, ఆపేక్ష ముందుకొచ్చి పదిగజాల దూరంలో మూడు చక్రాలసైకిలు తొక్కుతున్న అల్లుణ్ణి— స్వామిని — ఆమాంతం పరుగునపోయి కౌగలించుకుని ముద్దాడుకుంటూ ఎత్తుకుని మళ్లీ రాజయ్యగారి సమక్షానికి వచ్చాడు.

'ఈ సీజన్లో ఎంత తిరిగిందేమిటి వ్యాపారం?' అంటూ లాలనగా భోజనాల దగ్గర ప్రశ్నించాడు మంగపతి.

'పదిలక్షలు'

'అయితే—పదిలక్షలే — అయితే మా అల్లుడికి రెండు లకారాలిచ్చా వెనక వేళ అన్నమాట. ఇంక మా సంబంధాలు చేసుకుంటారూ?'

'ముందు కూతుర్ని కను అన్నయ్యా! అల్లుడెక్కడికి పోతాడుగానీ—' అంది 'రాక రాక వచ్చిన అన్నయ్య చేతిలో మరింత నెయ్యి గుమ్మరిస్తూ సీతమ్మ గారు.

'అయితే బిజినెస్‌లో ఏడాదికి ఒక లకారమన్నా మిగులుతున్నట్టేనంటావా బావా?'

"మిగలడం తగలడం ఆలోచించే ఏ మనిషీ వ్యాపారం చేయలేడు బావా. ఈ బిజినెస్ పెట్టినరోజున చేతిలో పట్టుమని పదివేలు లేకపోయాయి. ఇప్పుడంటావా? వేలకూ లక్షలకూ అంతు చిక్కడం లేదు. ఈ రోజుల్లో వ్యాపారానికి కావలసింది చొరవ బావా. మొండి తెగింపుండాలి. రూపాయి వచ్చిందని పొంగి, అర్ధపోయిందని కృంగేమనిషి — గుండె పోటొచ్చి మంచాన పడ్తాడు. చొరవగా వడిస్తే— గిట్టుబడి వుంటుందనుకో"

'నిజమే బావా! నాలుగు డబ్బులు కళ్ల జూడాలంటే బిజినెస్సే సుమా! ఉద్యోగాలలో ఏముంది బావా? ఏదో సామెత చెప్పినట్లు — గొర్రెకు బెత్తెడే తోకని. మా తాసీల్దారు సన్నాసున్నాడు—ఇత్తడి చెంబనుకో—అసలు పూర్వజన్మలో మహాపాపం చేసినవాళ్లకే ఈ కొలువులూ ఈ చివాట్లూను. దులిపేశాడనుకో మా వెట్టివెంకన్న ముందు పట్టుకుని ఆపీసుగు! పాపం కాదంటావా చెప్పు?'

'నిజమే అనుకో. పదిమంది మన చేతిక్రింద పని చేయడం జరిగినప్పుడు అదొక తృప్తి: ఒక మనిషి కారణంగా మనం పదిరూపాయలు తిన్నప్పుడు—అతగాడు అందులో అయిదురూపాయలు తిన్నా తప్పు లేదంటాను నేను.'

ఇలాగే చాలాసేపు చెప్పారు రాజయ్యగారు.

వళ్లంతా చెవులు మొలిచినట్లయింది మంగపతికి.

రాజయ్యగారిని గురించి చిరకాలంగా తాను ఎంత పొరపాటు పడిందీ అర్థం చేసుకున్నాడు మంగపతి. 'ప్రపంచంలో అరగానికి మారని అప్రయోజకుడికిచ్చి— దాని గొంతుకోశాడు మా నాన్న' అనుకున్నాడు. పదిమందితో అన్నాడు. ఈనాడు రాజయ్య ప్రయోజకత్వంముందు తనకు తానే అల్పజీవిగా కనిపించాడు. 'బావగారి' తో జీపెక్కి తిరిగిన రెండురోజులూ ఎంత ఆలోచించినా ఆయన ఆధిక్యత ఏమిటో అర్థం కాలేదు మంగపతికి. తాను ఏ విషయంలో తెలివి తక్కువవాడో అంతుచిక్కలేదు. సవాలక్ష లిటిగేషన్లలో తిమ్మిని బ్రహ్మి చేసిన తన బుర్రలో తెలివికి తక్కువ లేదనే నమ్మకంతో యింతకాలం బ్రతికిన మనిషి. నిజానికి 'రెండు రెళ్ళు మూడు' అని నిరూపించి కలెక్టర్ల మతులు పోగొట్టిన మేధావి మంగపతి.

ఈసారి రాజయ్యగారిని చూడగానే జ్ఞానోదయంలాంటి సంచలనం కలిగింది మంగపతి మెదడులో.

'కరణీకం వెలగబెడుతున్నానుగాని బావా —ఏం చెప్పను? ఆడంగులుకు కాలాలెన్నో తెలియని ప్రతిగాడిదనూ యింటి అల్లుళ్ల మాదిరి మేపుతూ — అప్పులు చేసి—తాలూకా కచేరీ చుట్టూ కాళ్లకు బలపాలు కట్టుకు ప్రదక్షిణాలు చేస్తే— నెలకు సర్కారువారు నెత్తిన గుమ్మరించేది ముష్టి పాతికరూపాయలు. లోగడ దస్తావేజులూ గట్రా వ్రాస్తే — పదీ పాతికా చేతికందేవి. ఈ పిదప కాలంలో నంటావా? బోడమ్మాడని ప్రతివెధవా సెకండుహేండు దస్తావేజుల మతలబు కొనుక్కొని — రెండురూపాయలు చేతిలో పెడితే చాలు — గికి పారేస్తున్నాడయ్యా ఎంత లావుపాటి దస్తావేజయినా తర్వాత కొట్టుకు చావండంటూ. ఈ మధ్య మరీ కటకట పడిపోతున్నాననుకో.' అంటూ కరుణరస ప్రధానంగా తన పరిస్థితుల్ని చెప్పుకుంటూ 'నాకూ ఏదన్నా వ్యాపారం చేయాలనుంది బావా?' అంటూ తన జీవుడు పడుతున్న వేదనను దీనాతిదీనంగా వివరించి చెప్పాడు మంగపతి.

రాజయ్యగారి భార్య సీతమ్మగారుకూడా 'అన్నయ్య' మాటలకు వంతగా అంతకు ముందే వాగ్దానం చేసినట్లు ఒక మంచి మాట వేయడం జరిగింది భర్త చెవుల్లో. తనను యింతకాలం అప్రయోజకునిగా భావించిన మంగపతి—అంతకు తగ్గ— అంత దీనంగా తన సహాయం అర్థించడం — రాజయ్యగారికి కూడా తృప్తి కలిగించింది. మొత్తానికి మంగపతి కరణీకం అమోఘంగా పనిచేసింది.

బావ–మరిదీ — ఇద్దరూ ఉమ్మడి వ్యాపారం ప్రారంభించారు.

చిరకాలంగా నిలిచిపోయిన రాకపోకలు మళ్లీ ప్రారంభమయ్యాయి.

కూతురు శ్రీదేవి పుట్టగానే పరుగు పరుగున వచ్చి 'ఒరేయ్! స్వాములూ నీకు పెళ్లాం పుట్టిందిరా' అంటూ ఆకాశాని కెత్తాడు 'అల్లుణ్ణి' మంగపతి. దొడ్లో కాసిన అనప పిందెలూ, గుమ్మడికాయలూ మోసుకొచ్చి రాజయ్యగారి వంటింట్లో గుమ్మరించి 'నీకివ్వమని నీ కోడలిచ్చింది సీతమ్మా' అంటూ ఆప్యాయంగా చెబుతున్న 'మంగపతి మామయ్య'ను చూసి సిగ్గుపడి మెలికలు తిరిగేవాడు స్వామి.

'ప్రపంచం—ఇద్దరినీ చూసి కృష్ణార్జునులనుకుంటున్నదే సీతమ్మా మేం వ్యాపారం నడిపిస్తున్న తీరు చూసి...'

లోకజ్ఞానం గల మనిషిగా పేరు తెచ్చుకున్న మంగపతి—పాములా అల్లుకుపోయాడు బిజినెస్‌లోగూడా. సంవత్సరానికి సగకాలం మంగపతి భార్యతోనూ — పిల్లలతోనూ రాజయ్యగారింట్లోనే ఉండేవాడు. (మైనారిటీ దాటుతున్నా పెద్దబాలశిక్షను భక్తి శ్రద్ధలతో చదువుతున్న పెద్దకొడుకు శంకరంతో సహా) రాజయ్యగారి మాటకు ఎన్నడూ ఎదురు చెప్పలేదు మంగపతి. 'నువ్వు చెప్పినట్లు 'అలా చేశాను అనేవాడు.

'లెక్కలు బావా' అని మంగపతి అన్నా ఎప్పుడన్నా — 'ఊరి మొత్తం లెక్కలువ్రాసిన వాడివి. నీ లెక్కల్లో తప్పేముంటుందిలే చూడటానికి?' అనేసేవారు రాజయ్యగారు. క్రమక్రమంగా ఆ విషయంలోగూడా రాజయ్యగారిని 'యిబ్బంది పెట్టటం' మానుకున్నాడు మంగపతి.

తరచుగా తమయింట్లోనే వుంటున్న అయిదారేళ్ల కోడలుపిల్ల శ్రీదేవిని ఎత్తుకుని యినపపెట్టె తెరిచి, మోయలేక పోయినా 'ఎప్పటికైనా యివన్నీ నువ్వు పెట్టుకొని తిరగవలసిన దానివేనే మహాలక్ష్మిలా,' అంటూ తల్లి సీతమ్మగారు ముచ్చట్లు చెప్పడం స్వామికి యింకా గుర్తుంది.

**(ఇంకా వుంది)**

# నేను లేచిపోను



Raghu
యర్రంశెట్టి శాయి

కాలేజికి చేరుకొనేసరికి కొంచెం ఆలస్యమయింది. క్లాసు అప్పటికే మొదలయిపోయింది. క్లాస్ రూమ్ దగ్గరకు చేరుకొంటూంటే నాకెందుకో కొంచెం భయం వేసింది. నాకే కాదు. మా క్లాసుకి ఆలస్యంగా వచ్చిన ఏ ఆడపిల్ల పరిస్థితయినా ఇంతే! అందులోనూ ఇవాళ ఫస్టవర్ తెలుగు. స్కూళ్ళల్లో కాలేజీల్లో తెలుగు ఉపాధ్యాయులు ఎలా ఉంటారో అందరికీ తెలుసు. మను చరిత్రలోని పద్యాలు కుర్రాళ్లను కవ్విస్తున్నట్లు ఎలా చదివి వినిపిస్తారో కూడా తెలుగు తీసుకొన్న ప్రతి ఆడపిల్లకూ తెలిసే ఉంటుంది. మా తెలుగు లెక్చరర్ ఆంజనేయులుగారు సార్థక నామధేయులు (క్షమించాలి! ఆయన్ని నిందించటం నా అభిమతం కాదు.) ఆయన ఆ పద్యాలు చదివి, అర్థ తాత్పర్యాలు, తన సొంత కవిత్వం చేర్చి వివరిస్తుంటే మా ఆడపిల్లల తలలు సిగ్గుతో భూమిలోకి ఎలా దిగపోయేవో మాకే తెలుసు. కుర్రాళ్లందరూ మారుపోతూ ఆయన శిష్యుల్లా కోతుల్లా ఆయనన్న ప్రతి వెకిలి అర్థాలకు ఇకిలిస్తూ, ఎక్కిరిస్తూ, మా ఆడపిల్లల బెంచీలవంక ఏదో పెద్ద ఘనకార్యం చేసినట్లు పోజులో చూస్తూ ఒకటే ఏమిటి— ఆ క్లాసంతా మాకు ముళ్లమీద ఉన్నట్టుంటే, మగపిల్లలకు స్వర్గంలో విహరిస్తున్నట్టుండేది. వాళ్ళ రభస అక్కడితో ఆగితే ఫరవాలేదు. అలా ఆగితే వాళ్ళు కాలేజి కుర్రాళ్లలా ఎలా అవుతారు. అయినా కూడా వాళ్ళు ఏవేవో బూతు పద్యాలూ, సినిమాల తాలూకా పిచ్చిపాటలూ, విరహ గీతాలూ— "హో సరోజినీ! హో తారా! హో శకుంతలా!" లాంటి హాహాకారాలూ— "హాయ్ డార్లింగ్!...హాయ్ స్వీటీ!... డ్రీమ్ గార్ల్, హాయ్ వీనస్, లవ్ గాడెస్' లాంటి ఇంగ్లీషు ప్రశంసలూ— "మేరీజాన్— మేరీ సనమ్ హో రోజ్, ఘుంఘట్ నికాల్, మేరే బాబా!......" లాంటి ఉర్దూ ప్రేమ పిలుపులూ— లభించినంతో సహా వినిపిస్తుండేవారు. మేము నలుగురయిదుగురు కలిసి ఉన్నప్పుడు, ఆ కుర్రాళ్ళ డైలాగులకీ, వాళ్ళ పిచ్చి వ్యవహారాలకీ— వాటిలో మేము చర్చలు ఘర్షణలనడి మార్కులు వేస్తూండేవాళ్ళం. ఎక్కువ మార్కులు వచ్చినవాడిని [illegible] తిట్టుకొనేవాళ్ళం. ఖర్మంకాలి ఒక్కర్తే ఉన్నప్పుడు ఎంత వేగంగా వీలయితే అంత వేగంగా తలవంచేసుకొని, సిగ్గుతో కమిలిప

మొఖాలతో క్లాసు రూముకి పరుగెత్తేవాళ్లం! (వో ఆడపిల్లలారా! మన ఖర్మ ఇంత ఘోరంగా కాలిపోయినందుకు విచారించకండి! మనకీ మంచి రోజులొస్తాయి. అప్పుడీ కుర్ర వెధవల్ని మనం వెంటాడి వేటాడకపోము. వాళ్ళు కన్నీరు పెట్టుకొని తలొంచుకొని పరిగెత్తే రోజు ఎంతో దూరం లేదు. ఆరోజు తలచుకుని ఇప్పుడు గుండెల్నిండుగా నవ్వుతూ తిరగండి.) కాలేజిలో అందరి ఆడపిల్లల పరిస్థితి ఇంతే! కాని సీత పరిస్థితి మాత్రం ఇదికాదు. ఇంతకూ సీత ఆడపిల్లయితేగా! దాన్నేనాడో మేము మగాళ్లలో జమవేశాం! అలా నూటికి నూరుపాళ్ళూ ఆడదయిన సీతని మొగాడిగా లెక్క వేయడానికి మేమేం పిచ్చాళ్లంకాదు. అది చేసే పనులలా ఉండేవి. కాలేజికి సైకిల్‌మీద దాని చిట్టి చెల్లాయితో డబుల్సు ఎక్కి వచ్చేది. మిగతా మగాళ్లతోపాటూ తనూ కాలేజి ఎదురుగ్గా వున్న చంద్రం బాబాయి హోటల్లో రోజు సాయంత్రం కాఫీ త్రాగేది. అక్కడే లెక్చరర్లతోటి అప్పుడప్పుడూ సబ్జక్ట్‌మీద వాదోపవాదాలు కూడా జరుపుతూండేదిట. (ఇలా అని జానకివాళ్లతమ్ముడి ద్వారా తెలుసుకొని మా అందరికీ చాటింపు వేసింది. మేము ఆ చాటింపుని కొంచెం మార్చి బహుశా సీత చంద్రం బాబాయి హోటల్లో ప్రేమ వ్యవహారాలు సాగిస్తోందేమోనన్న అనుమానాన్ని వెలిబుచ్చాం.) మా తెలివికి మాకే జోహార్లు. దానికి (సీతకి) మొగరాయుడిలా ధైర్యం కూడా ఎక్కువే! ఎవరయినా ఏమయినా అంటే చాలు అమాంతం సైకిలుకి బ్రేకులు వేసి (అంచేతే సైకిల్ బ్రేకులు మాంచి కండిషన్‌లో ఉంచేదని ఎవరో అన్నారు) దిగి, ఆ కుర్రాడి దగ్గరకెళ్లి "రాస్కెల్! వాటీజ్ దట్ యూ ఆర్ అట్టరింగ్? ఇఫ్ ఐ కిక్ యూ వన్స్, యూ కాంట్ రికవర్ ఇన్ యువర్ లైఫ్ టైమ్! టేక్ కేర్!" అనేసి, వార్నింగిచ్చి ఆ కుర్రాడు తెల్ల మొఖంవేసి చూస్తూండగా సైకిలెక్కి చక్కా పోయేది.

వో పి. యు. సి. కుర్రాడోసారి దాన్ని 'సైకిల్ రాణి' అని అరచాడని చెప్పి సైకిల్దిగి వాడినాపళంగా లాగి చెంప దెబ్బ కొట్టింది. దారినపోయే పెద్ద మనుషులు కూడా ఇజ్జూసి ఆ కుర్రాడి కక్కడకక్కడే పూలదండలేసి దేహశుద్ధి చేశారు. (బహుశా ఆ పెద్ద మనుషుల కూతుళ్లెవరయినా మా కాలేజిలో చదువుతోండవచ్చు) దాంతో ఆరోజు నుంచి అది కాలేజిలో మకుటంలేని మహారాణి అయి కూచుంది. ఎదురుగ్గా దాన్నెవర్నూ ఏమీ అనడానికి సాహసించేవారుకాదు. దాని ధైర్యానికి మా అమ్మాయిలందరికీ జోహారులర్పించాలనిపించినా, ఎంచేతో ఇష్టం లేక, దానిని మొగరాయుడిగా జమ కట్టి పరోక్షంగా సాధిస్తూ, ఆక్షేపిస్తూండేవాళ్లం. నో రోజు ఎలా పడిందో ఈ వార్త దాన్చెవిని బడింది.

"ఐ కేరే ఫుట్ ఫర్యూ ఆల్ రెచెడ్ గాల్స్. మీరు ఎన్ని యుగాలయినా మారరు. అమ్మమ్మలా తల వంచేసుకొని, కాలేజి యాక్టివిటీస్‌కి, మగాళ్ళకి దూర దూరంగా భయంగా తిరిగినంత కాలం మీ గతి అంతే! అంచేత మీరు చావండి! మీ సంగతి నా కనవసరం!" అనేసి వో మంచి రోజ్జూసుకొని మా అందరితో మాట్లాడడం మానివేసింది. ఆ సంవత్సరం అది డ్రమెటిక్ అసోసియేషన్ సెక్రటరీగా పోటీచేసి చిత్తుగా వోడిపోయింది. ఆరోజు మా కెంతో పర్వదినంగా అనిపించింది. అందరం తలో రూపాయీ వేసుకొని టీపార్టీ చేసుకొన్నాం. తోటి ఆడకూతురు వోడిపోతే సంతోషంగా టీపార్టీ చేసుకొనే ఘనత మాకే దక్కింది. (ఇంతకుముందూ, ఇక ముందూ కూడా మాలాంటి ప్రతిభగల అమ్మాయిలు ఉండరనుకొంటాను.)

ఆరోజు దానికెలా తెల్సిందో, మా టీ పార్టీ జరుగుతున్న రూమ్‌లో కొచ్చి మా అందరినీ ఇష్టమొచ్చినట్టు తిట్టింది. ఇలాంటి కుళ్ళూ, ఈర్ష్యలతో చచ్చే ఆడజాతి ఎప్పటికీ ముందుకి రాదంది. పైగా అందుక్కారణం మొగాడయినట్టు వాడిమీద ఏడుపెందుకంది! తోటి ఆడదాన్ని, వో మొగకాండేటు ముందు చిత్తుగా వోడించేసి, ఆపని వో గొప్ప ఎడ్వంచర్‌గా పరిగణిస్తోన్న మీ సిగ్గులేని మొఖాలకు సిగ్గుండాలి అంటూ ఉక్రోషపడి వెళ్ళిపోయింది. ఆ తరువాత అది మా అందరితోనూ కలవడం కూడా మానేసింది. కాలేజి కల్చరల్ వీక్‌లో అది ఒక్కర్తే పురుషపాత్రలేని ఏకపాత్రాభినయం తనే వ్రాసి నటించింది. చాలా బావుందని అందరూ అనుకొన్నారు. మేమందరం ఏడ్చినట్టుందని ప్రచారం చేశాం.

క్లాసు తలుపు దగ్గరకువెళ్లి నుంచున్నాను. కుర్రాళ్లందరి చూపులూ దాంబాణాల్లా నావేపు దూసుకొచ్చినయి. చేతనయింత వొక్కవేగా తలొంచుకొన్నాను. ఆంజనేయులు గారు మనుచరిత్రలోని ఆఖరి పద్యాలు రక్తిగా చదువుతున్నారు. రసవత్తరమయిన ఆ ఘట్టంలో ఆయన్నన్ను వీక్షమాత్రం పట్టించుకో లేదు. కనీసం చూడను కూడా లేదు. పదహారేళ్లనుంచి నేర్చుకొంటున్న చదువు తాలూకూ ధైర్యం తెచ్చుకొని "మే ఐ కమిన్ సర్?" అన్నాను. అన్నానేగాని అన్నానన్న నమ్మకం నాకే లేకుండా పోయింది. నా గొంతుకెందు కంత క్షీణించిపోయిందో నాకే ఆశ్చర్యం వేసింది. వో నిముషం గడిచింది. కుర్రాళ్లందరూ పద్యం వినటం మానేసి, నా వంక చూపు లప్పగించేసి అన్ని భాగాలూ పరీక్ష చేస్తున్నారు. మా ఫ్రండ్సందరూ వో క్షణం నన్ను చూసి ఏదో రహస్యంగా మాట్లాడుకొన్నారు. నాకు సిగ్గూ, దుఃఖం, చెమటలూ ముంచుకొచ్చినయి. ధైర్యాన్ని మళ్లీ కూడదీసుకొచ్చి "మే ఐ కమిన్ సర్?" అని గట్టిగా అన్నాను. అప్పుడు ఈ లోకంలోకి వచ్చిపడ్డారు ఆంజనేయులుగారు. వడి టైము చూసుకొన్నారు. చూసుకొని తలపంకించి, క్లాసువేపోసారి ఫోజు కొట్టి (ఆయన వయసు నలభై అయిదు సంవత్సరాలు. మగాడికి వయసుతో సంబంధం లేదు) ఇకిలించి "కమిన్" అన్నారు, ఎంతో దయ తల్చినట్టు. వెళ్ళి ఆఖరి బెంచీలో సీత ప్రక్కన కూర్చున్నాను. ఆ ఆఖరి బెంచి సీతకోసం ప్రత్యేకించబడింది. మిగతా నాలుగు బెంచీల్లో మేమందరం సర్దుకొని కూర్చుంటుండేవాళ్లం. ఎలాగోలా సీతకి మా బెంచీల్లో కూర్చోడానికి స్థలం కనబడకుండా చేసేవాళ్లం. అది కూడా ఆ విషయమసలేమీ గమనించనట్టు ఆఖరి బెంచీలోనే కూర్చోడం అలవాటు చేసుకొంది. కాని ఇవాళ నాక్కూడా ఆ నాలుగు బెంచీల్లో స్థలం కనిపించలేదు. ఎంచేతో అర్థం కాలేదు. ఎవరు ఆలస్యంగా వచ్చినా వాళ్ళ సీటు అలాగే ఖాళీగా ఉంచటం మా లేడి ఆడపిల్లల రివాజు. కాని ఇవాళ నేను కూర్చునేచోట రాధ కూర్చుని ఉంది. సీత ప్రక్కన కూర్చున్నానేగాని [illegible] డున్నంచి ఎప్పుడు లేచిపోదామా [illegible]

విసురు చూస్తున్నాను. 'ముళ్ళ మీద కూర్చున్నట్టు, అనే సామెత అప్పుడు నాకు బాగా అనుభవమయింది. సీతకు వీలయినంత దూరంగా కూర్చున్నాను. పిరియడ్ అయేంతవరకూ అసలు సీతవంక చూడకుండానే గడిపాను. పిరియడ్ అయింతర్వాత వెంటనే అక్కడ్నుంచి నా సీట్లోకి వెళ్ళిపోవాలని నా సంకల్పం. ఇంకా ఎక్కువసేపు కూర్చుంటే నన్నూ సీతతో జమచేసి చూస్తారేమోనని భయం. గంట మ్రోగగానే మ్రోగింది. వెంటనే లేచి పుస్తకాలు తీసుకొని ముందు బెంచీ దగ్గరకు వెళ్ళాను కాని బెంచిమొదట్లో కూర్చున్న సావిత్రి నాకు దారి ఇవ్వనే లేదు. అసలు నావంక చూడనే లేదు. పుస్తకం తెరచి చాలా దీక్షగా చదివేస్తోంది ఎప్పుడూ లేంది. రోజూ ఎంతో సరదాగా, ఆపేక్షగా పలుకరించే సావిత్రి, విమలా, రాధా, బేబి, ఇలా విద్యార్థినుల ప్రవర్తించటం నాకు ఉన్న మతిని పోగొట్టింది.

'ఎక్స్‌క్యూజ్! కూర్చోనీ! ఆ మొగరాయుడి ప్రక్కన నేను కూర్చోలేను బాబూ!' అన్నాను సావిత్రితో మెల్లగా. సావిత్రి ఎప్పటిలా నవ్వలేదు. మిగతా వాళ్ళు కూడా అసలు నామాటలు విననట్లే మరోదిక్కుకి చూస్తున్నారు. అదివరకు నేనెప్పుడయినా ఆలస్యంగా వస్తే ఎందుకాలస్యం అయిందో, ఏమిటోనని అందరూ ముట్టావ్వాయాగి అడిగేవాళ్ళు. ఇంచుమించుగా వాళ్ళందరకూ హీరోయిన్‌లా ఉండేదాన్ని.

'ఇక్కడ చోటు చాలదు! ముందు బెంచీలో కూర్చో!' అంది సావిత్రి మూతి బిగించుకొని. ఓవేళ సావిత్రి సరదాకలా అంటోందేమో -అనుకొన్నాను. ఈలోగా మా ఇంగ్లీష్ లెక్చరరు గారు క్లాసుకి వస్తూ కనిపించారు.

'త్వరగా జరగవే! లెక్చరర్ వస్తున్నారు...' అన్నాను త్వరపడుతూ.

'ఉహూ! మరో బెంచీలో కూర్చోవోయ్! మరీ ఇరుకయి పోతుంది! అంది నావంకచూడకుండానే. నాకొద్దిగా ఉక్రోషం వచ్చింది (ఉక్రోషం ఆడపిల్లల నెత్తినే ఉంటుంది. అంచేత పిలువక పోయినా వస్తూంటుందెప్పుడూ) విసురుగా మళ్ళో బెంచిదగ్గరకు వెళ్ళి జానకిని జరుగమన్నాను. జానకి తనకేమీ సంబంధం లేనట్లు ఊరుకొంది.' వీళ్ళందరూ నన్నేడిపించటానికిలా 'ప్లాన్' వేసుకొన్నారేమో అనిపించింది

ఈలోగా ఇంగ్లీష్ లెక్చరర్ రామచంద్ర రావుగారు క్లాసులోకి రానే వచ్చారు. అందరూ లేచి నుంచున్నారు. నేనూ అక్కడే జానకిప్రక్క నుంచుండి పోయాను. 'సిడౌన్' అన్నారాయన క్లాస్ వంక చూస్తూ. అందరూ కూర్చున్నారు. సీటు లేక నేనొక్కర్తెనీ నుంచుండి పోయాను. అందరూ మళ్ళీ కళ్ళు నాకేసి ఫోకస్ చేశారు. చాలా అసహ్యంగా ఫీలయ్యాను. బతిమాలే స్వరంతో జానకితో గొణిగాను... 'ప్లీజ్!......జరుగవే... కూర్చోనీ.....'

జానకి కొంచెం గట్టిగానే జవాబిచ్చింది. 'నువ్వు రోజూ కూర్చునేచోట కూర్చో! ఇక్కడ చోటు లేదు!'

జానకి గొంతు విని లెక్చరర్ నా వంక చూశారు.

'యస్'... అంటూ నావంక ప్రశ్నార్థకంగా చూశారు.

నాకు తగని సిగ్గు వేసింది. బోలెడు హార్స్‌పవర్ ఏడుపు కూడా వచ్చింది.

'న...థిం...గ్.. సర్!' అంటూ గొణిగి వెనక్కు వెళ్ళి సీత ప్రక్కన కూర్చున్నాను. రామచంద్ర రావుగారి ఇంగ్లీష్ పొయిట్రీ క్లాస్‌కో ప్రత్యేకత. ఆ క్లాసులో అందరం ఆ కాసేపూ మిగతా ప్రపంచాన్ని మరచి పోతాం! క్రిస్టబెల్— ఆ భయంకరమయిన రాత్రి వివేస్—ఆయన వర్ణిస్తుంటే మాకందరికీ ఆ కథ సినిమా చూస్తున్నట్లుండేది కాని, వింటున్నట్లుండేదికాదు. అలాంటి క్లాసులోకూడా నాకు ఆసలేమీ వినిపించలేదు. అర్థం కూడా కాలేదు. ఇవాళెందుకిలా అయింది? వీళ్ళందరూ ఎందుకిలా మారిపోయారు? అందరూ కట్టగట్టుకు సరిగ్గా మాట్లాడ్డం మానేశారే! పోనీ సరదాకనుకున్నా కూడా లెక్చరర్ ముందు కూడా సరదా ఏమిటి? ఏదయినా కారణముందా? నావల్లేమయినా పొరపాటు జగిరిందా? ఏమీ జరిగినట్టు గుర్తు లేదే? పోనీ సీతలా ఏవిషయంలోనయినా మొగరాయుడిలా, విడిచి పడి ప్రవర్తించానా? మగాళ్ళతో మాట్లాడానా? ఏమీ అర్థం కాలేదు. కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినయి. అఖరికి సీతలా నన్ను కూడా వేరు చేశారన్నమాట. అంటే నాతో వీళ్ళెవ్వరూ ఇక మాట్లాడరు. వాళ్ళ ప్రక్కన కూర్చోనివ్వరు. వాళ్ళతోపాటు తిరగనివ్వరు. కాలేజి లైఫ్ జీవితమంతటిలోకి అందమయిన కల లాంటిది. కాని అది చక్కని స్నేహిత బంధం ఉన్నప్పుడే! ఏ స్నేహమూ లేకుండా ఒంటరిపక్షిలాగ గడిపే వానికి స్టూడెంట్ లైఫే కాక జీవితమంతా కూడా నరకమే! మరి ఈ ఒంటరితనాన్ని సంవత్సరంనుంచీ సీతెలా భరిస్తోంది? కేవలం రెండుపిరియడ్ల అనుభవమే నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. మనస్తిమితం లేకుండా పోయింది. క్లాసు కాబట్టి ఊరుకుండి పోయాను. అదే ఇల్లయినట్లయితే సినిమాల్లోలా మంచం మీద పడి కరుణతీరా ఏడ్చేదాన్ని. (థాంక్ గాడ్! సినిమాలమూలాన జీవితంలో పనికొచ్చే దొక్కటయినా నేర్చుకోగలిగాను.) కళ్ళనిండుగా నిండిన నీటిలో నుంచి సీతను చూశాను. ఆమె మసగ్గా కనిపించింది. నిండుగా, ప్రశాంతంగా— తన ఒంటరితనాన్నీ, మమ్మల్ని లెఖ్ఖచెయ్యడం మానేసిన ఆమెని చూడగానే నాకు దుఃఖం ఆగలేదు. నిజంగా సీత గుండె నిబ్బరం మెచ్చుకోతగింది. ఆమె అప్పుడు నాకెంతో ఆత్మీయురాలిగా అనిపించింది. వో దేవతలా కనిపించింది. పిరియడ్ అయిపోయింది. ఆ పిరియడ్ ఖాళీ! అందరూ లేచి బయటకు వెళ్ళిపోతున్నారు. ఈ పిరియడ్‌లో మేమందరం నేరేడు చెట్ల క్రింద కూర్చుని కబుర్లు చెప్పుకోడం అలవాటు. కాని.... ఇవాళ, అందరూ నన్ను సీతతోపాటుగా వదిలేసి వెళ్ళిపోయారు. క్లాసు రూము ఖాళీ అయిపోయింది. ఆఖరి బెంచీలో వో మూల సీతా, మరో మూల నేనూ మిగిలాం! సీత ఏదో నోట్సు కాపీ చేసుకొంటోంది. టేబుల్‌మీద తల పెట్టుకొన్నాను. నా మనసంతా దిగులుతో నిండిపోయింది. ఫాన్లు కొద్దిగా చప్పుడు చేస్తూ ఆ రూములో తిరుగుతున్నయి. నే చేసిన తప్పేమిటి? ఎంతసేపలా ఆలోచిస్తూండి పోయానో నాకే తెలీలేదు.

నా భుజంమీద ఎవరిదో చెయ్యి పడటంతో ఉలిక్కిపడి తలెత్తి చూచాను. సీత నా దగ్గరగా జరిగి కూర్చుంది.

"ఎందుకలా ఉన్నావ్? ఆ ఇడియట్స్ అందరూ మాట్లాడ్డంలేదనా ? డోంట్ వర్రీ! అందుకే నేనసలు ఈ పక్షులకు దూరంగా ఉంటాను. ప్రొద్దున్న కొంచెం ఎర్లీగా వచ్చాను. అప్పుడే నీ గురించి వాళ్ళు చెవులు తెగేలా కొరుక్కోవటం విన్నాను. కాని నిన్నింత దారుణంగా వెలివేస్తారనుకోలేదు....."

సీత మాట్లాడింది. సీతకాదు. దేవత మాట్లాడింది. ఈ దేవత గొంతులో ఇంత తియ్యదనం, జాలి — ఔదార్యం ఉన్నట్టు నేను ఊహించనయినా లేదు. ఇలాంటి అందమయిన మనసుగల ఈ దేవతను ఒకరోజు నేనూ వెలివేశాను. ఈసడించాను. ఆమె ప్రక్కన కూర్చోవటం ఏదో అవమానంగా భావించాను. సీత ఒళ్ళో తల ఉంచుకొని ఏడ్వాలనిపించింది నాకు.

"కాని.... నేనేం చేశాను?... వీళ్ళందరూ ఎందుకిలా పగబట్టేరు నా మీద?...." వెక్కిళ్ళమధ్య అడిగాను.

"నా దురదృష్టంకొద్దీ ఆ కారణం కూడా విన్నాను. ఆడదానంత పనికిమాలిన వస్తువు ప్రపంచంలో మరొకటి లేదు. ఇలా అంటున్నానని ఏమీ అనుకోకు. నేను ఆడదాన్నే! కాని నే చెప్పింది నిజం! నువ్వే ఆలోచించి చూడు—మన డవున్‌ఫాల్‌కి కారణం— ఆడది — తనతోటి ఆడదాన్ని ఏదో కారణంతో ద్వేషించటం. ఈ విషయంలో మగవెధవలు నయం! చాలామంది ఫ్రీ అండ్ ఫ్రాంక్‌గా ఉంటారు— పోనీలే! ఇదంతా ఎందుకులేగాని మీ అక్కయ్య ఎవరితోనో లేచిపోయిందటగా— వాళ్ళందరూ అనుకొంటూంటే-విన్నాను. అందుకే నిన్ను వెలివేసేశారు. మీ అక్కయ్య లేచిపోతే వీళ్ళకెందుకో! వీళ్ళందరూ మొఖాలు మాడ్చుకొని, కొంపలు మునిగిపోయినట్టు మూటిరగులు పెట్టుకొన్నారు. ఇంతకూ ఈ సంగతి అసలు నిజమేనా?.. అంతా పుకారా? "

నాకు సిగ్గుతో శరీరమంతా కుంచించుకుపోయింది. మొఖం ఎర్రగా అయింది. ఏం చెప్పాలో తెలీలేదు. అక్కయ్య వారం రోజుల్రకితం లేచిపోయిన సంగతి నిజమే! ఆ నాలుగు రోజులు నేను కాలేజి కూడా మానేశాను. ఆ సంగతి ఎవ్వరితోనూ నేను చెప్పను కూడా లేదు. అమ్మ, నాన్న,అన్నయ్య, వదినలు దిగులుతో కుమిలిపోయారు.

తరువాత అక్కయ్య లేచిపోయినతన్ని రిజిష్టర్ మ్యారేజి చేసుకొని—ఇద్దరూ హాయిగా కాపరం చేసుకొంటున్నట్టు తెలిసి కొద్దిగా ధైర్యం తెచ్చుకొని దుఃఖం దిగమ్రింగి ఊరుకొన్నారు. మాదీ—ఆ కుర్రాడిదీ ఏకులం కాదు. అందుకని అక్కయ్య ఆ పని చేసింది. అక్కయ్య ఆ పని చేసినందుకు తప్పు నాదెలా అవుతుంది? వీళ్ళందరూ నన్నెందుకిలా హింసించదలుచుకొన్నారు? అదే సీతతో చెప్పాను.

"వాళ్ళను చావనీ! నువ్వు కూడా వాళ్ళకు దూరంగా ఉండు!" అంది సీత.

ఆరోజంతా ఎలాగోలా గడిపి బయట పడ్డాను. ఇంటికి వెళ్తుంటే కాలేజిలో ఏదో విలువయిన వస్తువుని పోగొట్టుకొన్నట్టనిపించింది. అతి కష్టంమీద బాధను దిగమ్రింగి ఇల్లు చేరుకొన్నాను. కాలేజినుంచి ఏడుస్తూ ఇల్లు చేరుకోవడం ఇదే మొదటిసారి. ఆ రాత్రంతా నాకు సరిగ్గా నిద్రపట్టనే లేదు. మర్నాడు కాలేజి కెళ్ళడానికి తయారవుతున్నానుగానీ, ఏం జరుగుతుందోనన్న భయం అధికం కాసాగింది.

"ఇంకా కాలేజి కెళ్ళవేమే?" అంటూ కేక వేసింది అమ్మ, నే నక్కడే తచ్చాడుతూండటం చూసి.

"వెళ్తున్నానే...." అంటూ ఖంగారుగా అనేసి బయటపడ్డాను.

గాళ్స్ వైటింగ్ రూం కెళ్ళేసరికి అందరు గుంపులు గుంపులుగా నుంచుని మాట్లాడుకొంటున్నవారల్లా నన్ను చూసి చటుక్కున ఆగిపోయారు. ఆ తరువాత గుస గుసలు ఎక్కువయినయి. పియుసి అమ్మాయిలు కూడా నా వంక ఏదో విచిత్రమయిన జంతువుని చూసినట్టు చూస్తున్నారు బెదురుగా. నాకు వాళ్ళను చూసేసరికి విపరీతమయిన కోపం వచ్చింది. బహుశా నాకు వూహ తెలిసిం తర్వాత అంత కోపం రావటం అదే మొదటిసారి! ఏమూల నుంచొని మాట్లాడుతున్న సావిత్రి దగ్గరకు నడిచాను.

"ఏమ్ ! నిన్న నన్నెందుకు కూర్చోనివ్వలేదు మీ బెంచీలో?" అన్నాను కోపంగా. నా కోపం చూసి సావిత్రి కొంచెం తడబడింది.

"అబ్బే! చోటులేదు. అందుకని! అంతే! కావాలంటే ఇవాళ మా అందరికంటే ముందే వెళ్ళి కూర్చో!" అంది.

ఇంకొక్క క్షణంకూడా అక్కడ నాకు నుంచోబుద్ధి కాలేదు. క్లాసుకివెళ్ళి ఆఖరి బెంచీలో సీతకి స్థలం వదలి ఆమెకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను.

వారం రోజులు గడిచినయి. ఆరోజు కాలేజినుంచి ఒక్కర్తెనే ఇంటికి వెళ్తున్నాను.



"ఒరేయ్! దీనక్కో లేచిపోయిందిరా! ప్రాడిక ఇదే సినియర్ లేచిపోవడానికి! ఎవ రయినా చూసుకోండి!"

వెనకనుంచి ఎవరో అన్నారు. చాలా గొంతులు ఘొల్లున నవ్వాయి. నాకు కోపం రాలేదు. వెనక్కుతిరిగి తీక్షణంగా చూశాను. అందరిలోనూ నా చూపులు దానికి తమ్ముడి గాఢ పడినయి. అయితే ఇదంతా దానికి మన్నన్న ప్రచారం అయివుంటుంది. తమ్ముడి ద్వారా కాలేజి అంతా వ్యాపింప జేస్తోంది అనుకొన్నాను. కన్నీళ్ళు తుడిచేసుకొని వేగంగా అడుగులు వేసుకొంటూ వాళ్ళ బారినుండి తప్పించుకొన్నాను. ఈ గొడవ అక్కడితో ఆగిపోలేదు. మర్నాడు కాలేజి గోడలమీద నా పేరు వెలసింది నా పేరు పక్కన కొన్ని అసహ్యకరమయిన పదాలూ వున్నాయి. క్లాసులోకి వెళ్ళి కూర్చున్నాను బోర్డుమీద నో డాన్సుచేసే అమ్మాయిబొమ్మ వేసివుంది, దాని క్రింద నాపేరు చాలా ముద్దుగా వ్రాశా రెవరో! తలవంచుకొని ఏదీనా పట్టించుకోకుండా కూర్చున్నాను. తరువాత ఒకరు రెండుగురు కుర్రాళ్ళు రోజూ కాలేజి వదిలింతర్వాత నాకు బాడి గార్డులుగా వస్తూసాగారు. ఈ బెడద ఎలా వదిలించుకోవాలో అర్థంకాక సతమతమవు తొంటే వో రోజు సాయంత్రం వో కుర్రాడు నా ప్రక్కకివచ్చి వో ఉత్తరం నా పుస్తకాల మీదకు విసిరేసి

"ఈ ఉత్తరం చదువుకో! నీకోసం సర స్వతీ టాకీస్ దగ్గర ఎదురు చూస్తుంటాను. తప్పకుండా రా!" అంటూ వెళ్ళిపోయాడు.

"బ్లడీ ఫూల్!" అంటూ గట్టిగా అర

# నేను లేచి పోను

చాను.

అంతకంటె వేయగలిగిందేముంది! ఇది కొంత మంది స్టూడెంట్స్ చూశారు. అందరూ గట్టిగా నవ్వేశారు.

"ఇదంతా బెట్టులేరా! అయినా అందరి ఎదురుగ్గా తీసుకోంటుందేమిటి?" ఎవరో అంటున్నారు.

కళ్లవెంబడి నీళ్ళు కారి చేతి మీద పడిందాకా నేనేడుస్తున్నట్లు నాకే తెలీలేదు. ఎలాగోలా ప్రిన్సిపాల్‌కి కంప్లెంట్ చెయ్యాలని ఎవ్వరే మన్నా పట్టించుకోకుండా ఘొరుకొంటూ వచ్చాను. కాని ఇంత ఘోరాన్ని ఎలా భరిం చటం? ఇక సహించటం నా వల్లకాదు. దేనికయినా హద్దు వుంటుంది. మర్నాడు ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్ళి ముందు రోజు సాయంత్రం జరిగినదంతా ఆయనకు విన్ వించి ఆ కుర్రాడు విసిరిన కవరు ఆయన టేబుల్ మీదుంచాను. అంతా విన్న తరు వాత ఆయన వో నిమిషం ఆలోచించారు.

"కూర్చో అమ్మా!" అన్నారు ఎదురుగ్గా ఉన్న కుర్చీ చూపిస్తూ.

"నీ గొడవంతా ఎప్పుడో నా నోటీసుకి వచ్చింది. నేనే నిన్ను పిలిపిద్దామనుకొంటు న్నాను. ఇంతలో నువ్వే వచ్చావ్! చాలా మంచి పని చేశావ్! ఈ కాలేజీలో, నా సర్వీసులో నీ అంత చెడ్డపేరు తెచ్చుకొన్న అమ్మాయిని నేనింతవరకూ చూడలేదు. నీలాంటి ఆడ పిల్లలమూలాన కాలేజికి చెడ్డపేరు వస్తుంది. నిప్పు లేందే పొగరాదన్న సామెత మీద నాకు పూర్తి నమ్మకం ఉంది. అంచేత నీకు టి.సి. ఇచ్చేస్తున్నాను. మరో కాలేజిలో చేరు. అక్క డయినా జాగ్రత్తగా నడుచుకో!"

నాకు మతిపోయింది. ఎంతో మంచివారనీ, ప్రతిభావంతులనీ పేరు తెచ్చుకొన్న ప్రిన్సిపాల్ గారేనా ఇలా మాట్లాడుతూంట! నా విష యంలో ఎందుకింత గుడ్డిగా ప్రవర్తిస్తు న్నారు?

"మీరు అన్యాయంగా మాట్లాడు తున్నారు సార్! నా కసలు ఏమీ తెలీదు...."

"ఇక నీ నుంచి నే నేమీ వినదల్చుకో లేదు. ఏ ఆడపిల్లని వెయ్యిని అన్నారే వాళ్ళు నీ విషయంలోనే ఎందుకు చేస్తున్నారు? నీలో ఏదో లోపం ఉండబట్టేగా! సాయంత్రంలో నీ టి. సి. రెడీ అవుతుంది. ఆఫీసులో తీసుకో!" లేచి వెళ్ళిపోయారాయన.

రాతిబొమ్మలా నుంచుండిపోయాను. కాని ఇప్పుడు దుఃఖం రాలేదు. బహుశా నా మనసు కూడా బండబారి పోయింటుంది.

టి. సి. తీసుకొని ఇల్లు చేరుకొన్నాను.

"అప్పుడే వచ్చేశావేం? కాలేజి లేదూ?" అమ్మ అడిగింది.

"కాలేజి లేదే అమ్మా! నా కొక్క దానికే కాలేజి శాశ్వతంగా మూసేశారు! అయినా నాకు చదువెందుకమ్మా! నాకు వయసు రాలేదా? అంచేత పెళ్ళి చేయండి. అక్క య్యలా లేచిపోతానని భయపడకండి. మీకు నచ్చినవాడినే చేసుకొంటాను. వాడో కోత యినా సరే! అయినా ఆంధ్రదేశంలో ఆడ పిల్లలకు చదువెందుకమ్మా? ఎవడడుగు తాడది? పెద్ద చదువులు చదివితే ఎదురు కట్నమిచ్చి చేసుకొంటారా? పోనీ ఉద్యోగం చేస్తే కట్నం లేకుండా ఎవరయినా చేసు కొంటారా? కట్నాల బాధ మీకు లేకుండా నా మనసుకి నచ్చిన వాడితో నే లేచిపోతే సంఘం వూరుకొంటుందా? ఆ కుటుంబా న్నంతా నాశనం చేస్తేవరకూ వూరుకోదు. అవునా? అంచేత నాకు చదువొద్దు. పెళ్ళి కావాలి. మీకు దమ్ముంటే చేయండి...."

ఆ తరువాత నాకు ఏడుపు ఆగలేదు. బిత్తరపోయి చూస్తోన్న అమ్మవళ్లో వాలిగి పోయాను. కళ్ళు మూసుకోగానే అసలు ఆడదనేది ఎలా ఉంటే బావుంటుందో ప్రతి ఆడపిల్లా కంటూండే కలలోని ఆడదాని రూపంలో సీత నా కళ్ళముందు మెదిలింది. కాని మన కలాంటి సీత లెంత మంది అమ్మాయి! ●



# వారఫలం

**15-5-1970 శుక్రవారం మొదలు**
**21-5-1970 గురువారం వరకు**

**మేషం :** కొన్ని వ్యవహారాల్లో మీరు అను కొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. రాజ కీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సు కొం టారు. రావలసిన డబ్బు సమయానికి అందగలదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉం టాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**వృషభం :** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో ఋతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. ప్రయాణా లోచనలు చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడం బరం కోసం వ్యయం చేస్తారు.

**మిథునం :** సామాన్యమైన పనులకు కూడా యెంతో కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు:— బంధువులకు సహాయం చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో అను కూలత లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగ మాటాలు తగవు. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. ఏ వ్యవహారంలోను విశేషమైన ఫలితం లభించదు.

స్త్రీలకు:— సంతోషకరమైన వార్తలను వింటారు. బంధుమిత్రులను కల్సు కొంటారు.

**సింహం :** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచ యాలు యేర్పడతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహా రాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉం టాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సమయా నికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి రాగలదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**తుల:** అధిక వ్యయం జరగడం వలన ఆర్థి కంగా ఒత్తిడి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యో గంలో గౌరవం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్య భారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్య క్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహస ముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వృత్తిలో ప్రయాస కలుగుతుంది. అధిక వ్యయం జరుగు తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**ధనుస్సు :** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. వ్యాపా రంలో ఆదాయం బాగా ఉంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు:— దైవకార్యాలు నెరవేరతాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం :** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధు మిత్రులను కల్సు కొంటారు.

**కుంభం:** లాభం రావలసిన వ్యవహారాల్లో నే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఆందోళనకు గురి కాగలరు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సంతోష కరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు:— అధిక వ్యయం జరుగు తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మీనం :** ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందు తుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. వారం మధ్యలో మీరు ప్రయోజనం లేని శ్రమకు గురి కాగలరు. సాహసముతో కూడిన వ్యవహా రాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. ప్రయాణా లోచనలు చేస్తారు.

—మహేష్






జగన్, నేనూ కలిసి గ్రాండ్‌ట్రంక్ రోడ్డుమీదుగా నడిచి పెద్దపాడు బాడా మెట్టుమీద కూచున్నాం.

సంధ్యారుణ కాంతులతో నిండిన ఆకాశం విలాసంగా పడుకుని, సన్నగా పొడుగ్గా ఉన్న రోడ్డుని, ఇరుపక్కలా పరుచుకున్న పచ్చటి తివాసీలాంటి పంట చేలని, విశాలనయనాలతో పరికిస్తోంది.

సన్నని గాలికి కెరటాల్లా ఊగుతోన్న చేను కనుచూపు కందని తీరాలకి పాకుతున్నట్టుగా ఉంది.

జగన్ సిగరెట్టు తీసి వెలిగించాడు.

అతను చెప్పబోయేదేదో ప్రేమకథలాంటిదని తెలుసు.

నాకు అన్నిటికన్నా విసుగెత్తించేది ఇలాంటి కథలే! నే రాసిన ఏ కథలోనూ ఆ కథావస్తువు కనిపించదు.

దానికి కారణం, నే ఏర్పరుచుకున్న కొన్ని అభిప్రాయాలు.

అందమైన వాస్తువుని చూసినప్పుడు మనసు ఆకర్షిత మవుతుంది.

శరీరకావసరాలు వాంఛకి మసిపూసి మారేడుకాయ చేసి గొప్పగొప్ప వాక్యాలు చెప్పిస్తుంది. స్వార్థానికి ముసుగేసి త్యాగాలు చేశానని నమ్మించ చూస్తుంది.

ఒక గుడ్డిపిల్లని, అనాకారిని ప్రేమించిన కథానాయకుడు హృదయాన్ని సాక్షిగా తీసుకొస్తే ఆ ప్రేమకథని స్వీకరించటానికి నాకు అభ్యంతరం లేదు.

'ఆ అమ్మాయి నడుం పిడికిటంత ఉంటుంది. కళ్ళు, కలువరేకుల్లా ఉంటాయ్. వక్షోజాలు ఉన్నతంగా ఉంటాయ్. పిరుదులు ప్రబంధనాయికి మల్లే విరిగి పోయుంటాయ్' అని జగన్ నాకు చెప్పడు.

చెప్పకపోయినా, ఇలాంటి విషయాలు తొలుకి పోయి చదవటం కరతలామలకం నాకు.

'చూడు మూర్తీ! నన్ను లుచ్ఛా అను, రౌడీ అను, లేదా గొప్పవాడను. ఏదనుకున్నా నాకు ఇబ్బందిలేదు. ఇది నిజమైన కథ. దీన్ని ఇంకాస్త రంగులు పూసి తయారు చెయ్యటం నీపని' అన్నాడు. జగన్.

'హుఁ!' అని, ఒక నవ్వు నవ్వేను. ఎందుకో నానవ్వు వికారంగా ఉంటుందని

నాకు లనుమానం.

'సరే! ఇంక కథ చెప్పు. మధ్యలో 'కోత' కొట్టను. టేప్‌రికార్డర్‌లా మెదడు 'సెట్' చేశాను' అన్నాను.

జగన్ చెప్పటం మొదలుపెట్టాడు...

లెక్కలక్లాసు ఎప్పుడున్నా, ఆ ముందు రోజు సాయంత్రం నాలుగు లెక్కలు ప్రిపేర్ అవటం నాకు అలవాటు.

ఆ రోజున ఏదో ప్రాబ్లమ్ సాల్వ్ చేస్తున్నాను. సంధ్యాసమయం. ఈజీచేర్‌లో డాబామీద కూచున్నాను. లెక్క చేస్తూ, మనసులో గుణిస్తూ చేతులు తిప్పటం అలవాటు నాకు.

గిరుక్కున వెనక్కి తిరిగి మొహం చిట్లించుకుని విసవిసా వెళ్లిపోయింది ఎదురింటి అమ్మాయి.

ఎదురుగుండా డాబామీద ఒక అమ్మాయి నిల్చుందని గమనించలేదు నేను. ఆమె ఎలా ఉంటుందోకూడా తెలీదు నాకు. కాని ఆ నడకలో తమాషా అయిన సొగసు కనిపించింది. పొడుగాటి వాల్జడ విసురులో, బోలెడంత టెక్కు కనిపించింది. పుష్టిగా, నిండుగా, పొగరుగా ఉన్న విగ్రహం ఒక్క లిప్తకాలంలో మాయమయ్యింది.

నా చేతులు తిప్పటం ఆమె తప్పుగా అర్థం చేసుకుని ఉండొచ్చు. 'సరే, అదేదో నిర్ధారణచేద్దాం', అనుకున్నాను.

మరుసటి రోజు రోజంతా నా కళ్లు ఆమెకోసం వెదికాయ్.

మూడోరోజు సాయంత్రం అదేచోటులో మళ్లీ కనిపించింది.

నాకేసి తిరిగినప్పుడు నిజంగా నే చెయ్యి వూపాను. గబగబా డాబా దిగిపోయింది.

ఆ సంగతి, అంతటితో మర్చిపోయాను. కాలేజీలో చదివేటప్పుడు ఇలాంటి కోతిపన్లు ఎన్నో చేశాను. స్కూల్‌మేష్టరుగా జాయినయి ఏడాది దాటలేదింకా. ఇదేం సీరియస్‌గా తీసుకునే నైజంకాదు నాది.

కాని ఆమెకు నా ప్రవర్తన, నామీద ఏవగింపుతో పాటు కుతూహలాన్నికూడా పెంచిందని నాకు తెలీదు.

అదీ కాకుండా కుర్రజగన్ మేష్టారు మంచివాడని ఆ వీధిలో పెద్దవాళ్లందరిలో, ఒక నమ్మకం ప్రచారంలో ఉంది.

ఆమెకు కోపాన్ని కలిగించిన సంఘటన నాకు అర్థమైంది. కాని, ఈ మంచి కుర్రాడి వింతప్రవర్తన ఆమెకు అర్థం కాలేదు.

సాంబశివం, నే పనిచేసే స్కూల్లోనే టీచరు. నాకు కాస్త డబ్బు ఇబ్బంది కలిగినప్పుడు నాలుగు ట్యూషన్స్ చూపించింది అతనే. చాలా సరదాగా మాట్లాడే మనిషి, స్నేహపాత్రుడు అనిపించినమనిషి స్కూల్లో అతనొక్కడే. అందువల్ల అతని పరిచయం చాలా త్వరలోనే మంచి మైత్రిని దృఢపరిచింది.

ఒకరోజు నా రూమ్‌కి వొచ్చినప్పుడు, ఈ విషయం చెప్పి, ఆ అమ్మాయిని చూపించాను. ఆ అమ్మాయి వివరాలు ఇంకొన్ని సేకరించి, నాకు చెప్పాడు. ఆ అమ్మాయి చెల్లెలికి క్లాస్ టీచర్‌కూడా సాంబశివమే.

'వాళ్ల బాబు పోలీస్ ఆఫీసరోయ్ నాయనా! వెర్రివేషాలెయ్యకు. జాగ్రత్తగా ఉండు' అన్నాడు. సాంబశివం ఆ పిల్ల వివరాలు చెబుతూను.

'పోలీసాఫీసరయింది, గవర్నర్ జనరల్ ఐంది, వొదిలిపెట్టు. ఎవడూ మనదగ్గరకు రాలేదు. అయినా వాళ్ల బాబుకన్నా ఆ అమ్మాయికే పోలీస్ ఆఫీసరు లక్షణాలెక్కువ ఉన్నాయ్‌రోయ్' అన్నాను, ఆ అమ్మాయి నడక గుర్తు తెచ్చుకుంటూ.

నా విట్టుకి సాంబశివం నవ్వలేదు. మొహం సీరియస్‌గా పెట్టి, 'అనవసరమైన విషయాల్లోకి తలదూర్చి ఆరోగ్యం పాడుచేసుకోకు బాబ్జీ! ఆ అమ్మాయి నిన్ను 'లవ్' చేస్తుందనికూడా ఆశపడకు. నీకన్నా పెద్దవాణ్ణి కాపోయినా, నీమేలు కోరినవాణ్ణి' అని ఇంకో బోడి విట్టు పేల్చాడు నామీద.

సాంబశివం జోకు నవ్వు తెప్పించేది కాదు. సాంబశివంతో నాకు ఏర్పడ్డ స్నేహం, అతను నన్ను తేలిగ్గా హేళన పర్చేదికాదు. కాదు—ఇది నా వ్యక్తిత్వానికి సవాలు అనుకున్నాను.

'సరే సాంబశివం. ఆ అమ్మాయి దగ్గర్నించీ ఉత్తరాన్ని తీసుకొచ్చి ఆమెకు నామీద అభిప్రాయం ఉందని ధృవపరిస్తే ఏవంటావ్?' అన్నాను.

సాంబశివం బదులుగా నవ్వేశాడు. నేనా పని చెయ్యలేనని అతని నమ్మకం.

నేను ఆవేళ అనాలోచితంగా చెయ్యి వూపటం ఆమెకి ముప్పు తెచ్చిపెట్టింది. ఒక అపరిచితుడు అలాంటి పనిచేసినప్పుడు, నైతికంగా ఆ మనిషి చాలా చెడిపోయినవాడై ఉండాలి.

ఆ అభిప్రాయం గట్టిపర్చుకోటానికి ఆమె నన్ను జాగ్రత్తగా గమనిస్తూ వొచ్చింది. స్కూలుకి వెళ్లేప్పుడూ, వొచ్చేప్పుడూ, సెలవురోజుల్లో డాబామీద తిరిగినప్పుడూ, ఆమె దృష్టి నామీద ఉండటం గ్రహించాను.

చాలా జాగ్రత్తగా ఆలోచించినమీదట, ఆ కుతూహలం కేవలం ఒక మనిషి నైజాన్ని గుర్తుపట్టటానికి కాదని, ఇంకా బలమైన సహజమైన ఆకర్షణకు ఆమెకు తెలీకుండానే ప్రభావితురాలవుతూందని తెలుసుకున్నాను.

ఆడవాళ్లు శరీరకంగా, ఇమోషనల్‌గా పెరిగినంత త్వరగా ఇంటలక్చువల్‌గా పెరగరు.

అందువల్లే వాళ్లు మగాడికి లొంగిపోయేది.

కల్యాణితో మాట్లాడే అవకాశం నాకు చిక్కలేదు. కాని చాలా త్వరలోనే కళ్లతో మాట్లాడ్డం ఆమె తెల్సుకుంది. సైకిల్‌మీద స్కూలుకి వెళ్లేటప్పుడు వరండామీద నిల్చుని నవ్వేది.

స్నేహితులతో మాటాడుతూ వెళ్తూ ఆమెకి వినబడేలా రెండు అర్థాలు స్ఫురించేలా ఆమె అందానికి కాంప్లిమెంట్స్ విసిరేవాణ్ణి.

నిజం చెప్పాలంటే కల్యాణి అందానికి అది సరిపోదు. ఆమె కాటుక కళ్లను చేపల్తోనూ, ఆలుచిప్పల్తోనూ పోల్చటం నేరం అవుతుంది. ఆమె నాసికను సంపెంగతోనూ, చిన్నినోరు సున్నాతోనూ పోల్చటం ఒక పిచ్చివాడిపని.

ఆమె సౌష్టవమైన దేహాన్ని చూసినప్పుడు, పాపపు ఆలోచనలగాలి సోకినప్పుడు ఒకటి రెండుక్షణాలు నా శరీరం వణకటం నిజం.

నాక్కావల్సింది చిన్న ఉత్తరం. ఆ తర్వాత, ఆమెకు నా ప్రమేయం ఉండదు. అంతవరకూ వ్యవహారం సజావుగానే

ఉంది. విశ్వరూపం ఇక ఎంతదూరమో లేదు.

స్కూల్లో సాంబశివాన్ని పిల్చి చెప్పాను.

'ఇంక, ఎంతో దూరం లేదు. రెండు రోజుల్లో నామాట నిలబెట్టుకుంటాను' అన్నాను.

సాంబశివానికి నేనన్నదేమిటో సరిగ్గా అర్థంకాలేదు. అంతవరకూ నే పడిన తిప్పలు, ఆ అమ్మాయిని దారికి తీసుకొచ్చిన వైనం అంతా చెప్పాను.

సాంబశివం నమ్మినట్టు కనిపించలేదు.

'సరే చూద్దాం' అన్నాడు.

మర్నాడు అతనికి నేను చూపించిన చిన్న ఉత్తరం చూసి నివ్వెరపోయాడు.

డియర్...

నిన్న రాలేకపోయినందుకు క్షమించండి. మీకిష్టమయితే రావడానికి వీలుగా ఉంటుంది. ఆదివారం మూడుగంటలకి వీరభద్రా టాకీస్‌దగ్గర ఎదురుచూస్తూ ఉండండి.

క.

పరీక్షలో నెగ్గినంత సంతోషం కలిగింది నాకు.

సాంబశివం, ఓటమిని చాలా స్పోర్టివ్‌గా తీసుకున్నాడు.

ఎందుకంటే ఇందులో అతనికి పోయిందేమీ లేదు గనుక.

పార్టీ ఇచ్చి, 'విష్ యూ గుడ్‌లక్' అన్నాడు.

'ఏడిశావ్ నాకు అలాంటి ఉద్దేశం లేదు' అని కొట్టిపారేసినా ఎందుకో మనసులో దిగులేసింది.

ఇదంతా తమాషాకి చేసేనని చెప్పనా? లేక, మేం పందెం వేసుకున్నాం, నిన్ను ఈ ఆట ఆడించమని చెప్పనా? లేక, చెంపలేసుకుని క్షమించమని అడగనా?

ఏం పాలుపోలేదు. చెప్పిన టైముకి సినిమా హాలుగేటు దగ్గర కాపలా కాశాను.

కల్యాణి చెప్పిన సమయానికి సరిగ్గా వచ్చింది. టిక్కెట్లు ముందే తీసుకున్నాను. హాల్లో దూరేక, తెలిసినవాళ్ళు ఎవరూ లేక పోవడం మూలాన ప్రాణం తెరిపిన పడింది.

నాకోసం భయం లేదు. ఆ అమ్మాయి తెగింపుకి ఆశ్చర్యం కలిగింది. ఎవరయినా చూస్తే ఆమె జీవితం దెబ్బతినే పరిస్థితి.

కల్యాణి నేనూ అట్టే మాట్లాడు కోలేదు. బాక్సులో మా చుట్టూ మనుషులు కూడా ఎవరూలేరు. మిసమిసలాడే యవ్వనం. మనిషిని రెచ్చగొట్టి చిత్తు చేసే సౌందర్యం. తెగించి చెంతచేరిన పిల్ల. కాని నేను చొరవ తీసుకోలేదు.

సినిమాహాళ్ళు వెలి వెయ్యకపోతే ఒక పడుచుపిల్ల సాంగత్యం చాలా సునాయాసంగా దొరుకుతుంది. ఆమెను ప్రేమిస్తున్నాననుకుని నన్ను నేను మభ్య పెట్టదల్చుకోలేదు. ఆ అభిప్రాయం తొలగించు కోడానికి స్క్రీన్‌మీదకి దృష్టి మరల్చాను. సాధ్యపడలేదు.

'కల్యాణీ నేనంటే నీకు ఇష్టమేనా?' అని అడిగాను, విడిపోయేముందు—

'అది పిచ్చిప్రశ్న. ఇంట్లో వాళ్ళందర్నీ మోసంచేసి ఇలా వచ్చేదాన్ని కాదు' అంది.

ఇలా చాలా సినిమాలు చూశాం. చాలా జాగ్రత్తగా కలుసుకునేవాళ్ళం. అంత వరకూ, తెలిసినవాళ్ళకంట పడక పోవటం అదృష్టం.

దొడ్డితోవన తలుపు తీసిఉంచినప్పుడు అర్ధరాత్రి దొంగలా వాళ్ళ ఇంట్లోకి దూరేవాణ్ణి. కల్యాణి తండ్రి, తల్లి, చెల్లెలు మంచినిద్రలో ఉండేవాళ్ళు.

పువ్వుపువ్వులాంటి వెన్నెల్లో, కొబ్బరి చెట్టుకింద కల్యాణిని మొదటిసారిగా ముద్దు పెట్టుకున్నాను. మగాడిగా నాకు అది మొదటి అనుభవం. కల్యాణి నాకేసి చూట్టానికి సిగ్గుపడింది. తీయని అనుభవం తీగలాసాగి, అణువణువులో కోటి కల విద్యుత్తుని ప్రసారంచేసింది. మోహాన్ని రగిల్చి, ఉన్మత్తుణ్ణి చేసే స్పర్శ కల్యాణిని నాదానిగా చేసింది.

సాంబశివం మర్నాడు స్కూల్లో కలిసినప్పుడు ఏమీ దాచకుండా చెప్పాను. ఎంతటి రహస్యమయినా సరే అది ఇచ్చిన అనుభూతి మనిషిని కుదిపేసినప్పుడు సాంబశివంలాంటి ఆప్తమిత్రుడికి తెలియనివ్వటంలో నాకు తప్పు కనిపించలేదు.

సాంబశివం ముందే ఊహించినట్టుగా నాకు తెలుసు అన్నట్టుగా నవ్వి. 'భాయ్! కౌగిలింత ముద్దులతోనూ, కళ్ళ సైగలతోనూ ఆగిపోయేది కాదు—ప్రణయానికి ఇది రెండోమెట్టు' అని, ఆగేడు.

నాకు తెలియకుండానే ఇలా చాలా రోజులు గడిచిపోయాయి.

కల్యాణిని చూడకపోతే మనసు నిలిచేది కాదు. ఒక్కోసారి అర్ధరాత్రి గోడ గెంతాల్సి వచ్చినప్పుడు, కాళ్ళూచేతులు విరిగినంతపని కూడా అయింది.

రాత్రి చాలా త్వరగా తెల్లారిపోయేది; పగలు సాయంత్రంపూట నీడలా సాగుగయి



# రాబిన్ బ్లూ ప్రత్యేక హామీ



## అతి చౌకగా మీ వస్త్రాలకు స్వచ్ఛమైన తెల్లదనం

రాబిన్ బ్లూ—ప్రత్యేకంగా తెలుపు చేయగలనట్టిది. ఇతర నీలిమందులు ఇవ్వలేనట్టి తెల్లదనాన్ని ఇది ఇవ్వగలదు. చిటికెడు రాబిన్ బ్లూతో అనేక బట్టలను తెల్లగా ఉతుక్కోవచ్చు. పైగా ఇది సురక్షితమైనది— సర్వదా మీ వస్త్రాలను ధవళతరంగా వుంచగలదు.




## ప్రకృతి సహజమైన తెల్లదనానికి రాబిన్ బ్లూ

కోసేదీ:

తిన్నగా పాఠాలు చెప్పటం మానేసాను. పరీక్ష రోజుల్లో పిల్లలు' గోలపెట్టే వాళ్ళు.'

సాంబశివంకి 'కళ్యాణి విషయం చెప్పటం మానేశాను. ఏదో అశాంతి మనసును దొల్చటం మొదలయింది.

'ఏం జగన్ — కళ్యాణి మత్తుమందు పెట్టేసిందా? నాతో మాట్లాడ్డం కూడా మానేశావ్' అనేవాడు సాంబశివం. ఆ విషయం తప్పించి ఇంకో టాపిక్‌లోకి సంభాషణ మార్చేవాణ్ణి.

ఒక మగాడు, ఆడది అంత చేరువుగా ఉన్నప్పుడు స్వీట్ నథింగ్స్ తప్ప వేరే విషయాలేమిటుంటాయ్ మాట్లాడ్డానికి? చందమామ రోజురోజుకి కళలు పెంచుకుని వికసిస్తాడు. నక్షత్రాలు ఇంకా కాంతివంతంగా కనిపిస్తాయ్.

అరోజు మాటల సందర్భంలో చెప్పింది.

'నాన్నగారు ఏదో సంబంధం తీసుకొచ్చారు. యక్షప్రశ్నలువేసి నన్ను సెలక్టు చేశాడు అబ్బాయి. నా కిష్టం లేదని నాన్నగారితో చెప్పేశాను' అంది.

'ఏం? అబ్బాయి బాగాలేడా?' అన్నాను.

'అది నా కనవసరం' అంది.

'కళ్యాణి! నాపెళ్ళి నిశ్చయం అయిపోయింది' అన్నాను తమాషాకి. నిజంగనే

# వల

ఇంటినుంచి ఉత్తరాలు శరపరంపరలుగా వస్తున్నాయ్.

'మంచిదే! సంతోషం' అంది.

'ఎవరితోనో అడగవేం?' అన్నాను.

'నా కనవసరం' అంది.

ఆ పిల్లగుండె నిబ్బరానికి ఆశ్చర్యపోయాను.

'నిజం చెబుతున్నాను. నేను బ్రాహ్మణ్ణి. నువ్వు తెలగాపిల్లవి. మానాన్న మావాళ్ళలోనే ఎవర్నో చూశాడు. బహుశా ఆయన మాటకి నేను ఎదురు చెప్పలేక పోవచ్చు' అన్నాను.

'నాకేం నష్టం?' అని ఎదురు ప్రశ్న వేసింది.

'నువ్విలా పెళ్ళికొడుకుల్ని తిరక్కొట్టేంతర్వాత, మన సంగతి బయటపడి నేను నిన్ను వదిలేస్తే నీ సంగతి ఊహించు.' అన్నాను.

'ఈ దెబ్బతో కంట నీరు పెట్టుకుంటుంది అనుకున్నాను మనస్సులో —

కళ్యాణి తొణకలేదు. క్షణంసేపు ఆలోచించింది.

'నన్ను చేసుకుంటే నిజంగానే మిమ్మల్ని వెలేస్తారా?' అంది.

'అందర్నీ నేనే వెలెయ్యాలి.' అన్నాను.

కళ్యాణి చేసినపని నాకు నచ్చలేదు. నేను ఆమె జీవితంతో చెలగాటమాడినా ఆమె పూర్తిగా మోసగింపబడటం నాకు ఇష్టం లేదు.

రూమ్‌కొచ్చాక చాలా ఆలోచించాను. కళ్యాణిని చేసుకోటానికి నేను సిద్ధంగా లేను. ఆమెతో స్నేహం చేసింది పెళ్ళి చేసుకోటంకోసం కాదు. నాకు మొందు మంచి' అలాంటి అభిప్రాయం లేదు.

రెండురోజులు ఆమెను తప్పించుకు తిరిగాను, పదే పదే ఆమె కళ్ళముందు కదలాడింది. గుండెల్లో బాధ — దుస్సహమైన వేదన.

నిజానికి ఆమెనుంచి - నేను ఆశించాల్సిందేమీ లేదు. శరీరకంగా ఆమె నాలో వ్యామోహాన్ని రెచ్చగొట్టే ఆకర్షణ లేదు. మునుపటిలా అనుభవం కోసం పడే తపనా నాలో లేదు. అది నగ్నసత్యం.

కాని, కళ్యాణి ఆకర్షణ సూదంటురాయిలా నన్ను లాగుతోనే ఉంది. నా స్వార్థం అదే కేంద్రంనుంచి పుట్టుజారి నిస్సహాయంగా ఆమె చుట్టూ అల్లుకుంటున్నాను.

మూడోరోజు కళ్యాణి దగ్గరకు వెళ్ళాను, ఆమెను తాకకుండా కూర్చుని కబుర్లు చెప్పటం మొదలు పెట్టాను. ఆమె కళ్ళల్లో ఎంతటి అభిమానం నిండి ఉందని!—ఆమె మనసులో ఎంత గొప్ప స్థానం నాకు ఇవ్వబడిందని!

కళ్యాణి రెండు రాత్రులు తలుపు తెరిచి నా కోసం చూస్తూనే ఉంది. నిద్రలేని మొహం, తిండి తినని మొహం—బాలెంతరాలులా, కొడుకుని చూసిన తల్లి పొందే ఆనందంతో వికసించింది.

నాలుగైదారేడు రోజులు దాటాయ్, నెల గడిచింది. ఇంకో రెండుమూడు — నిమిషాల్లో గడిచాయ్. కళ్యాణి సాన్నిధ్యంలో గడిపిన ప్రతిక్షణం విలువైంది. ఆమెను తాకకుండా మాత్రం జాగ్రత్త పడేవాణ్ణి.

నేను వాంఛించేది కళ్యాణి అందంగాని, యవ్వనంగాని కాదని రుజువైపోయింది. కేవలం ఆమె సామీప్యం బ్రతుక్కో అర్థాన్ని తెలుపుతుంది.

అయితే నే కోరేది కళ్యాణి మనసునా? ప్రేమాభిమానాలు గుప్పించి లోబర్చుకున్న కళ్యాణినా? నా లాభికకు అందని



ఏ బంధం పెనవేస్తోంది? ఆమెను కోరి వప్పుడు ఆమెకోసం ఎందుకు వెంపర్లాడుతున్నాను.

'ప్రేమ' అనే మాట మీద నాకు నమ్మకం తక్కువ. నేను దానికి ప్రేమ అని నామకరణం చెయ్యటానికి ఉత్సహించను.

సాంబశివం రోజూ వచ్చి పిచ్చాపాటీ వేసి వెళ్ళిపోతున్నాడు. స్కూల్లో రొటీన్ వర్కు ఎప్పట్లా సాగుతోంది. టైమ్ గడవటానికి ట్యూషన్లు ఎక్కువచేసి మనసులో ఆలోచనల స్రవంతికి ఆనకట్ట కట్టే వృధా పరిశ్రమ పడుతున్నాను.

ఆ రోజురాత్రి నా గుండెల్లో గూడు కట్టుకున్న భయం నిండుగా మారింది. కల్యాణిమాత్రం నిశ్చలంగా ఉంది. ప్రశాంతమయిన సరోవరంలా, కడిగిన మంచి ముత్యంలా, ప్రఫుల్లవదనం అలరారుతోంది. ముంగురులు కపోలాల మీదకి జారి వింతసోయగాన్ని అందిస్తున్నాయ్.

'కల్యాణీ మై స్వీట్' అని హార్దోద్రేకంతో ముద్దు పెట్టుకున్నాను. ఆ పరిస్థితి, హాస్యానికి భయం కలిగించేటయినా, కల్యాణి భార్యస్థానంలో ఉంటే ఎంతటి ఆనందాన్ని కలిగించేవార్త!

కల్యాణి మా వలపుకి ప్రతీకగా బాబునో, పాపాయినో అందివ్వబోతోంది.

ఇక, ఈ నాటకానికి తెర దించెయ్యాలి. సుఖాంతం చెయ్యాలి. కల్యాణితో వెంటనే వివాహం చేసుకోటం తప్ప గత్యంతరం లేదు అనుకున్నాను.

కల్యాణి తండ్రితో విషయం నేరుగా చెప్పాలి. పోలీసాఫీసర్ కళ్ళుకప్పి ప్రేమాయణం నడిపినందుకు గన్ గట్రా పట్టుకొచ్చి గుండేసి పేల్చలేడు. మండి పడ్డా ఒప్పుకోక తప్పదు.

కల్యాణి వీధి గుమ్మంగుండా వెళ్ళి డ్రాయింగ్ రూములో కూర్చున్నాను. కల్యాణి చెల్లెలు రాణి వొచ్చి వాళ్ళ నాన్నగారు లేరని చెప్పింది. వాళ్ళ అమ్మగారు వొచ్చి చూసి వెళ్ళిపోయారు.

వెనక్కి తిరిగొస్తుంటే సాంబశివం కనిపించాడు. ఆతనికి ఈ విషయం రూమ్‌కి పిల్చి చెబ్దా మనుకున్నాను.

'ఏంకథ?' అన్నాడు, నన్ను చూడగానే! 'రూమ్‌కి రా, చెబుతాను' అన్నాను.

కంటె ఆరాధనతో, ప్రేమతో చూడటం కష్టం.

మాటల్లోదింపి సాంబశివం ప్రసక్తి తెచ్చాను.

'రాణి ప్రైవేట్ మేస్టారా?' అంది. అంతకుమించి సంభాషణ పొడిగించే చేవ కల్యాణి ఎదురుగా నాకు లేదు.

మనసులో, 'ఈమె నాబిడ్డకి తల్లి, ఇంకో ప్రియుణ్ణి వెతుక్కుంటోన్న నయవంచకి' అనుకున్నాను.

'అమ్మకి అనుమానంగా ఉంది. ఇంక దాచిపెట్టటం కష్టం. ఏంచేద్దాం?' అంది.

'ఇప్పట్లో పెళ్ళి అసాధ్యం కల్యాణి! ఇద్దరం బైటపడకుండా ఉండాలంటే ఒకటేమార్గం... ...పోనీ... కూడదూ?' అన్నాను.

కల్యాణి కళ్ళల్లో అదే ప్రశాంతి. కళ్ళల్లోంచి రెండు నీటిబొట్లు కిందకి జారాయి.

'ఏం?...భయమా కల్యాణి?' అన్నాను. లేదని తలూపింది.

మర్నాడు నాకు తెలిసిన డాక్టర్ దగ్గిరికి తీసికెళ్ళాను.

'జీవితంలో ఇవి తీపిగుర్తులు. కల్యాణికీ, నాకూ కూడా ఇది ఘోరమైన శాపం — ఏ రకంగా, నాకసి తీరటానికి ఇది మార్గం...' అని కూడా అనుకున్నాను.

కల్యాణి మనిషికాదు. రాక్షసి. ఎంతటి బాధనైనా చిరునవ్వుతో ఓరుస్తుంది. ఎంతటి మగాణ్నైనా చిరునవ్వుతో గొంతుక కోస్తుంది.

నెలరోజులు కల్యాణిని చూడకుండా ఉండిపోయాను.

అది జరిగాక, కల్యాణితో పూర్తిగా తెంచుకుని చేతులు కడుక్కుని బయటపడొచ్చు నేను. కల్యాణి లేకుండా బ్రతకలేను. ఎంత నిగ్రహించుకుందామనుకున్నా ఆలోచనలు ఆమె దగ్గిరకు పోయేవి.

సాంబశివంతో నవ్వుమొహం పెట్టుకుని మాటాడేవాణ్ని. డాబామీదికి తీసుకొచ్చి, కూచోపెట్టి, కల్యాణి ఎదురుడాబా మీద ఉన్నప్పుడు ఇద్దర్నీ పరిశీలించేవాణ్ని.

**నాకు నిజం కావాలి. వాళ్ళిద్దరి మధ్యా** వున్న రహస్యంతో నా జీవితం ముడిపడి వుంది. కల్యాణిని విడిచిపెట్టి బ్రతకటం ఎంత కష్టమో, చేసుకున్నాక సాంబశివం ఎదురు పడ్డప్పుడు, నే వ్రాసిన దృశ్యం గుర్తుకొచ్చినప్పుడు, నే పడే నరకయాతనను భరించటం అంత కష్టం.

ఆమె విసిరిన ప్రేమ అనే ఇంద్రజాలం నన్ను ఉచ్చులో బిగించింది. కంటికి నిద్రలేదు—మనసులో ద్వేషం—ఆమె పట్ల తెంచుకోలేని ప్రేమ.

ఒడ్డున పడ్డ చేపపిల్లలా, గిలగిలలాడే మనసుకి నిజం కావాలి.

ఆ రోజు రాత్రి పిచ్చివాడిలా కల్యాణి ఇంటికి బయల్దేరాను.

నిజం తేల్చుకోవాలి. కల్యాణి నిజంకక్కేదాకా తిరిగొచ్చేది లేదు, అనుకున్నాను.

పెరటి వీధిగుండా వెళ్ళి తలుపు తోశాను. చీకట్లో కొబ్బరిచెట్టు దెయ్యంలా నిల్చుంది. లోపల తలుపులన్నీ వేసున్నాయి. కల్యాణి పడుకునుంటుందనుకుని, చేసేది లేక వెనక్కి తిరిగాను.

డాబామీద, చీకట్లో కల్యాణి ఆకారం కనిపించింది. బైట మెట్లగుండా డాబా ఎక్కాను.

'వెనకాతల వేపు అద్దెకిచ్చాం. మెల్లిగా మాట్లాడండి. అమ్మావాళ్ళు ఇంకా పడుకోలేదు' అంది కల్యాణి.

నెలరోజులయి అర్ధరాత్రి మంచులో నాకోసం కల్యాణి కళ్ళల్లో వొత్తులు పెట్టుకుని నిరీక్షిస్తోంది. లోపల్నించి ఉన్న మెట్లలోవన, కల్యాణి వాళ్ళు రావటానికి ఆస్కారం ఉంది.

గబగబా అడిగేశాను. 'కల్యాణి! నీకూ, సాంబశివంకి ఉన్న సంబంధం నాకు పూర్తిగా తెలియాలి. అబద్ధం చెప్పటానికి ప్రయత్నించకు. నాకిప్పటికే సాంబశివం చాలా చెప్పాడు' — అని బొంకేను.

కల్యాణి వింతగా చూసింది.

'త్వరగా చెప్పు. ఏ క్షణాన్నయినా మీవాళ్ళు రావొచ్చు. ఈ క్షణం మనిద్దరి జీవితాలకీ పరీక్షాసమయం' అన్నాను.

'ఆయన, రాణికి మేస్టారు. ఎక్కువ చొరవ తీసుకోటానికి ప్రయత్నించేవారు. అమ్మతో చెప్పి మాన్పించేశాను. ఇప్పుడు ట్యూషన్‌కి రావటం లేదు' అంది.

'సాంబశివం నాకు చెప్పాడు. నువ్వు దాచిపెట్టి లాభంలేదు. నిజం కావాలి కల్యాణి! — నేను నిన్ను బెదిరించటం లేదు. అర్థిస్తున్నాను — ప్రాధేయపడుతున్నాను కల్యాణీ...'

నా మాట పూర్తికాలేదు.

కల్యాణి తల్లి లోపలి మెట్లగుండా తలుపు తీసుకొచ్చింది. నేను స్థాణువులా ఒక్క క్షణం ఉండిపోయాను. అంతవరకూ మా మధ్య వున్న రహస్యం ఆమెకు తెలీదు.

కల్యాణి నేల చూపులు చూస్తుంది—



'మీరు అనవసరంగా గొడవ చెయ్యకండి. నేనేం పొరపాటు చెయ్యలేదు' అని చెప్పి హఠాత్తుగా డాబామీంచి గెంతేశాను.

ఎందుకలా చేశానో చెప్పలేను. నన్ను పట్టుకుని అల్లరి చెయ్యటానికి వాళ్ళకి అవకాశం ఉందనిపించింది. అంతే!

నాకు బుర్ర పూర్తిగా చెడిపోయింది. రెండునెల్లు సెలవు పెట్టి ఇలా వొచ్చేశాను. ప్రతిక్షణం, సాంబశివం కల్యాణి నా కళ్ళముందు కదిలి మనశ్శాంతిని తినేస్తున్నారు.

కల్యాణిని నేను విడిచి పెట్టలేను.

ఆ దృశ్యాన్ని మర్చిపోలేను.

ఆ తుఫానుహోరు నుంచి తప్పించుకోవాలంటే, కల్యాణిని చూడకుండా ఉండగలగాలంటే, ఎక్కడికో పారిపోవాలి.

మూట్‌కేస్‌లో రెండు బట్టలు కుక్కి, రెండొందలు అప్పుచేసి ఇలా బయల్దేరాను. మళ్ళీ వెనక్కి వెళ్తానో లేదో తెలీదు. నాకు మరి గమ్యం అంటూ లేదు. చదూకున్న ఊరిది. కాస్త మనశ్శాంతి దొరుకుతుందన్న భ్రమలో ఇక్కడి కొచ్చాను. మీరంతా ఉన్నా, ఆలోచనలు వెంటాడి నన్ను పీక్కు తింటూనే ఉన్నాయ్.

నాలో తప్పు లేదనను. నేను మోసం చెయ్యలేదనను, కాని చివరికి కల్యాణిని మనస్ఫూర్తిగా స్వీకరించాను మూర్తీ! —వాళ్ళు చేసిన దగా నన్ను దహించి వేస్తోంది.

నన్ను శాడీ అను, బచ్చా అను, దగా కోరను. కల్యాణి నాకు జీవితాన్ని చూపించింది. కల్యాణిని మనసారా నమ్మాను—చివరికి మోసపోయింది నేను. ఆ రోజు చూసిన దృశ్యం మరిచిపోలేను. సాంబశివం ఎంత మిత్రద్రోహి అయినా ఆమె ప్రోత్సాహం లేకుండా అంత చనువు తీసుకోడు. కల్యాణి నాకు చేసిన అన్యాయాన్ని భరించలేను. ఆమె లేకుండా బ్రతకలేను. —ఇది ఎటూ తేలని సమస్య. నన్ను నిలువునా క్షణక్షణం కాల్చేస్తోంది. నువ్వు కథలు రాస్తావని తెల్సు. ఇది నువ్వు కథగా రాయాలి. దీనివల్ల నాకు కలిగే లాభం అంటూ లేదు, నిజమే! ఒప్పుకుంటాను. వాళ్ళ ద్రోహ బుద్ధి

# వల

వాళ్ళకు వెల్లడి కావాలి వాళ్ళలో ఏకాస్త మానవత్వం ఉన్నా తప్పు తెలుసుకోవాలి. పశ్చాత్తాప పడాలి నాకు జరిగిన అన్యాయం వాళ్ళకు తెలీదు. తల్చుకుంటే, ఇద్దర్నీ బజార్నపెట్టి శిక్ష వెయ్యగలను. ఒక హంతకుడికి ఉరిశిక్ష వెయ్యొచ్చు. కాని, అతను చేసిన ఘాతుకాన్ని, దుర్మార్గాన్ని, చూపించటానికి మనసుకు మరమ్మత్తు చేయాలి. హృదయం కరగాలి —కంటనీరు కాల్వగా కట్టాలి. అప్పుడు తను చేసిన తప్పు తెలిస్తే, గుండె పగిలి చస్తాడు. వేరే శిక్ష అనవసరం...

... జగన్, చివరిముక్కలు ఆవేశంగా చెప్పి, నుదుటను పట్టిన చెమటని రుమాలుతో తుడుచుకున్నాడు. సాయంత్రం అయిదింటికి మెట్టుదగ్గర కూచున్నాం. వాచీ చూసుకున్నాను. రేడియం డయల్ ఎనిమిది చూపించింది.

చీకట్లో కనిపించటం లేదుగాని జగన్ మొహం ఎర్రగా కంది ఉంటుంది.

కథంతా విన్నాక ఎవరికయినా జగన్ మీద జాలేస్తుంది. నాకు కలిగినభావాన్ని మొహంలో పసిగట్టటం, పట్టపగలు కూడా సాధ్యంకాదు.

సాహసంతో, జీవితాన్ని, అందులో సుఖాల్ని దుఃఖాల్ని అనుభవించి, సుతిమెత్తని అనుభూతుల్ని శ్రుతిచేసి, సెలయేరులా, జలపాతంలా, అనుభవాల లోతుల్లో నిండుగా ప్రవహించే నదిలా, కాలమనే సాగరంలోకి, నింపాదిగా కదిలిపోయే మనిషి జగన్.

అందువల్ల నా కతనిమీద జాలి పడవల్సిన అవసరం కనపించలేదు.

నల్ల కళ్ళద్దాలుతీసి ఒకసారి తుడుచుకున్నాను. ఒంటరితనంలా చీకటి బిక్కు బిక్కు మంటోంది.

'చాలా చీకటి పడింది — నడుద్దాం జగన్' అన్నాను. దార్లో జగన్ చెప్పిన కథ గురించే ఆలోచిస్తున్నాను.

కల్యాణిని పట్టటానికి వల విసిరింది జగన్. ఆ వేట వినోదం కోసం. అది శ్రుతి మించి రాగానపడి జగన్ ఎరగా మారేడు. సాంబశివం ఆ ఎరని పట్టుకుని కల్యాణికి ఉచ్చులు బిగించాడు.

జగన్‌కి, కల్యాణికి ఉన్న సంబంధం చాలావరకూ పోయిందని సాంబశివానికి తెలుసు జగన్ కథనిబట్టి, సగం, జగన్ సాంబశివానికి చెప్పాడు. మిగిలింది, సాంబశివం పొంచివుండి గమనిస్తున్నాడు.

సాంబశివం తీసుకున్న చొరవ కల్యాణి ఇచ్చింది కాదు. ఆమెకున్న అక్రమ సంబంధం అతనికిచ్చిన ధైర్యం అది.

కాని, సాంబశివం అంచనా తప్పిపోయింది. కల్యాణి జగన్‌ని మనస్ఫూర్తిగానే ప్రేమించింది. అతనికి తన్ను అర్పణ చేసుకోటంలో తప్పు కనిపించలేదు. అది అలుసుగా తీసుకుని, సాంబశివం హద్దు మీరేదాకా తను తొందర పడిందని తెల్సుకోలేక పోయింది.

తన అంచనా తప్పిపోయాక జగన్ ముందు తప్పు ఒప్పుకోటానికి సాంబశివంకి ధైర్యం చాల్లేదు. దానిక్కారణం. అంతకుముందు అతనితో కుదిరిన మైత్రిలో స్వలాభాపేక్ష లేదు

జగన్ తను కల్యాణిని ప్రేమిస్తున్నానని తెలుసుకునేముందు సాంబశివందగ్గర ఏమీ దాచలేదు. అతను చెప్పినదాంట్లో ఆమెను ఆకర్షిస్తున్నానన్న దర్పంఉంది. —రెండోది, ఆమెపట్ల అతనికి ఏర్పడ్డ మోహం. కేవలం ఒక ఆడదాని మీదుండే కోరిక.

దాంతో సాంబశివం బుర్రలో దుర్బుద్ధి పుట్టింది. అప్పటికి జగన్ జాగ్రత్త పడ్డాడు. ఆమెపట్ల అనురాగం కలిగేక ఆ విషయం సాంబశివానికి దూరంగా ఉంచేడు.

నిజమాలోచిస్తే జగన్ ప్రేమలో మొదటి నుంచి ఉదాత్తత లోపించింది. ముందు ఆమెతో చెలగాట మాడటం వినోదం కోసం. తర్వాత, మోహాన్ని చల్లార్చుకోటం కోసం. అతనికి కల్యాణిపట్ల ఉంది ప్రేమ అనటంకన్నా, కృతజ్ఞత అంటం బావుంటుంది. ఆమెలోని స్నిగ్ధత నిర్మల అంతఃకరణ, అతనిలో కృతజ్ఞతని నింపింది.

జగన్ ఆమెను ప్రేమించి ఉంటే, అతనికి సమస్య అంటూ లేదు. అతనికి తెలీకుండానే ఆమెను వొదుల్చుకోవాలన్న కాంక్ష అంతర్గతంగా ఉంది. దానికి బలమైన కారణం కావాలి. అది వచ్చినిజంలా

కనిపించాలి.

దానికి మళ్ళా సాంబశివమే ఆధారం అయ్యాడు కాని, ఆ నిజం నే చెబితే జగన్ భరించలేడు. తాత్కాలికంగా బాధపడుతూ అనుపొందే ఉపశాంతికూడా, దూరమవు తుంది.

కాలం ఎలాంటి గాయాన్నయినా నయంచేస్తుంది. జగన్ ఆమెను ప్రేమించ లేడు. పెళ్ళి చేసుకోలేడు. జగన్ చాలా దురదృష్ట జాతకుడు. కల్యాణిలాంటి పిల్ల నా జీవితంలో తారసపడితే, ఆమె కోసం సర్వస్వం ధారపోసేవాణ్ణి. ఆమె వ్యక్తిత్వంముందు జగన్, సాంబశివాలు మిణుగురులు.

సాంబశివం పుర్రెలోపుట్టిన బుద్ధి

# వల

ఇంకా అడ్డుతోవల తొక్కుతుంది. కారణం లేకుండానే, ఆమెమీద పగతీర్చుకో వాలన్న కాంక్ష బలీయమవుతుంది. ఆమె చరిత్రను, వీధిలోకి ఈడ్చక మానడు.

చివరికి వలలో చిక్కుకుని గిలగిల లాడేది కల్యాణి.

నేను అనుకున్నట్టుగానే జగన్ చెప్పింది చాలా మామూలు ప్రేమకథ.

ఒక గుడ్డి పిల్లని, అనాకారిని ప్రేమించిన కథానాయకుడు హృదయాన్ని సాక్షిగా తీసుకొస్తే, ఆ ప్రేమ కథని స్వీకరించటానికి నాకు అభ్యంతరంలేదు.




నా ప్రేమకథంకి కాలంలు లేరు. నే ప్రేమిద్దామనుకున్న ఏ అమ్మాయీ నా కోసం కల్యాణిలా నొత్తులు పెట్టుకు చూడలేదు. కనీసం క్రీగంట వీక్షించలేదు.

అందుకని వాళ్ళని తప్పుపట్టటం నా కిష్టం లేదు. నా దురదృష్టానికి చింతించను.

నా కలానికి ప్రేమకథలు అతకవు. నా మనసుకి నామోహం అతకనట్టు.

ఆడపిల్లని ప్రేమించటం అనేది, నాకు చేతయినట్టుగా ఏ మొగాడికీ కాదని నా గుడ్డి నమ్మకం.

జగన్ ఇంకో రెండ్రోజులుండి వెళ్ళి పోయాడు. వెళ్ళేముందు 'జగన్! కల్యాణి అడ్రస్ నాకియ్యి ఆ కథకి ముగింపు ఇవ్వటానికి, ఆమె నొక్కసారి చూడాల' అన్నాను.

జగన్ వెళ్ళిన నెల్రోజులకి అతని పెళ్ళి శుభలేఖ నాకు అందింది.

పెళ్ళికూతురు కల్యాణి, గౌరాణి, డైమాన్‌రాణి కాదు వెంకట సుబ్బలక్ష్మి.

పెళ్ళికి వెళ్ళొచ్చిన మిత్రులు చెప్పారు—మంగళ సూత్రం కట్టేదాకా జగన్ దేవదాసులా ఉన్నాడు. అమ్మాయి కుందనపు బొమ్మలా ఉంది. పెళ్ళి జరిగిన మర్నాటినుంచి జగన్ ఆమెను అమితంగా ప్రేమిస్తున్నాట్ట.

నా రెండో జోస్యంకూడా నిజమైంది. సాంబశివం, కల్యాణిని అల్లరిపాలు చేశాడు. డప్పు తగిలించుకుని, ఊరూరా తిరిగి, ఆమె కళంకాన్ని కీర్తించాడు.

కల్యాణికి పెళ్ళి కాలేదు.

వలలోపడింది ఎవరో కాదు, కల్యాణి—గుండెలమీద కుంపటి—రిటైర్డ్ పోలీసా ఫీసర్ కూతురు, కల్యాణి తిలకం.

ఆమెను వలవేసి పట్టింది జగన్‌కాదు సాంబశివం కాదు. మీకు చెబుతోన్న కథ కుడు.

ఇప్పుడామె కల్యాణిమూర్తి.

ప్రేమంటే నాకు గొప్ప ఎలర్జీ. మా కల్యాణికూడా అదంతా ఉత్త 'ట్రాష్' అంటుంది. కల్యాణిని చేసుకున్నాక రాత్రిపూట చలవ కళ్ళద్దాలు పెట్టుకో టం మానేశాను.

ఇప్పుడు నన్నూ, నా గజూకంటినీ కూడా కల్యాణి ప్రేమిస్తుంది. ●

*ధర్మపథం:*

# మదము దమము

*బులుసు వేంకటరమణయ్య*

■ మానవునికి కీర్తిని కలిగించేవి ధనము, విద్య, ఉత్తమ వంశ మునున్నూ. విద్య లేకపోయినా, ఉత్తమ వంశంలో పుట్టకపోయినా, ధనం ఉంటే గౌరవాన్ని పొంద వచ్చును. లేక- ధనం లేకపోయినా, తనది ఉత్తమ వంశం కాకపోయినా విద్య ఉంటే - దానినిబట్టి నలుగురి లోనూ పేరు సంపాదించవచ్చును లేదా-విద్యా ధనాలలో యేదీ లేక పోయినా-ఉత్తమ వంశంలో పుడితే- అట్టివానిని జనులు గౌరవిస్తారు. ఈ విధంగా-విద్యా-ధన-వంశాలు గౌర వానికి ముఖ్యమైన హేతువులని తెలుస్తున్నది.

అయితే - ఇవి గౌరవ కారణా లయినా ఆశ్రయభేదాన్ని బట్టి గర్వా నికి కూడా కారణాలు కావచ్చును. దురహంకారంతో ఉన్న వారిని ఇవి ఆశ్రయించి ఉంటే గర్వాన్నే కలిగి స్తాయి. అట్టివారిదగ్గర ధనం ఉంటే అది దుర్వినియోగమై ముఖస్తుతి పరులపాలవుతుంది. అందువల్ల ఆ ధనికునికి మదం కలుగుతుంది. ఆ రీతినే అతడు విద్యావంతుడయినా- తన్ను మించిన విద్వాంసులు మరె వ్వరూ లేరనే అహంభావం ఏర్పడు తుంది. అందువల్ల సాటి విద్వాంసు లను అవమానించడానికి అతడు వెనుక తీయడు. ఈ రీతిగానే దుర హంకారి పుట్టిన వంశం గొప్పదైతే ఆ పేరు చెప్పుకుని గర్విస్తూ యిత రుల్ని ఎంతో తేలికగా చూస్తాడు. ఉత్తమ పదార్థాలు అయోగ్యుల దగ్గర వున్నా కూడా అవి స్వభా వాన్ని మార్చలేవు.

ధన, విద్యా, వంశాలు ఉత్తముల దగ్గర ఉన్నట్లయితే మదానికి బదు లుగా దమాన్ని కలుగజేస్తాయి. వీటివల్ల వారి సహనశక్తి, వినయ వి ధే య త లు పెంపొందుతాయి. సత్పురుషుల వద్ద ధనం వుంటే అది యోగ్యులకు దానం చెయ్యబడు తుంది. అందువల్ల అగణ్యమైన పుణ్యఫలం వారికి లభిస్తుంది. వారి వద్ద విద్య ఉంటే-దాన్ని ఇతరులకు బోధిస్తారు గాని - ఎవ్వరికీ చెప్ప కూడదని దాచుకోరు. విద్య వున్న కొద్దీ-ఏమీ తెలియదనే అనుకొంటూ యింకా విద్యాధనసంపాదనకు యత్ని స్తారు. వారు ఉత్తమ వంశంలో పుట్టి వుంటే-అంతమాత్రాన గర్వం పొంది యితరులను హీనంగా చూడరు. తక్కువ వారిని తమతో సమానంగా గౌరవించినప్పుడే తమ గౌరవం పెరుగుతుందని వారు గ్రహిస్తారు. పురుగుపల్లి ఏరి. డే పట్టు పునీతమైనదిగా ఉంటున్నదనీ, పుట్టిలో మాణిక్యాలు లభిస్తున్నా యనీ చెప్తాతూ - తక్కువ వారిని కించపరచకుండా, వారికి ఉత్సా హాన్నే కలిగిస్తూ ఉంటారు. అందు వల్లనే-

"విద్యా మదో ధన మదో
తృతీయాభిజనో మదః,
ఏతే మదా మదాంధానాం
ఏత ఏవ సతాం దమాః"

అని మన పెద్దలు చెప్పారు. ఈ అభి ప్రాయాన్నే దీని అనువాదం

"ధనమ్మును విద్యయు వంశం
బును దుర్మదులకు మదం బొన
రించును; స
జ్జనులైన వారి కడంకువ
యును వినయము నేర్పు
సుర్వీనాథా!"

అనే పద్యం వివరంగా తెలుపు తున్నది.

ఉత్తమాలయిన ధన, విద్యా వంశాలను సరదైన పద్ధతిలో ఉప యోగించుకోవడమే మేలు. అలా చేసినప్పుడే నలుగురిలో నూ "భళా!" అనిపించుకోడానికి వీలవు తుంది. ●

గొలుసు నవల







నలుగురు రచయిత్రుల సంయుక్త రచన

మూడవ భాగం

వాసిరెడ్డి సీతాదేవి

### జరిగిన కథ

శ్యామల రాధలతో పాటు మాధవిని కూడా స్వంత కూతుర్లాగే పెంచింది పరమేశ్వరి. శివశాస్త్రికి మాధవి మీద కంటే మాధవి తెచ్చే జీతం మీద అభిమానం ఎక్కువ. శ్యామలకి రాజారావుతో పెళ్ళయింది. శ్యామల బిడ్డనికని కన్ను మూసింది. ఆ బిడ్డ భారం మాధవిపై పడింది. ఆ యింట్లోనే అద్దెకుంటున్న మధు మాధవిని ప్రేమించాడు. మాధవిని రాజారావు పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడని తెలుసుకుని మధు కెళ్ళిపోయాడు. రాధ తిరుగుళ్ళ గురించి మాధవి హెచ్చరించవలసి వచ్చింది. రాజారావు ఉత్తరానికి మాధవి హతాశురాలవుతుంది. పాపని అతనికి అప్పగించడానికి పరమేశ్వరి ప్రయాణమవుతుంది.

---

## 11

రాజారావు కట్నం డబ్బు పంపించినట్లు చెప్పలేదు. మాధవి చెబితే శివశాస్త్రి మొత్తం డబ్బు తీసేసుకుంటాడనీ భయపడ్డది. మధుకు ఇవ్వాల్సిన వెయ్యిన్నర ఇచ్చేశాక చెప్పాలనీ, మిగిలిన డబ్బు ఇంటి ఖర్చులకు పరమేశ్వరి చేతికి ఇవ్వాలనే అనుకుంది. పరమేశ్వరి బయటకు వెళ్ళగానే కళ్ళు మూసుకొని పడుకొంది. కునుకు పట్టింది.

'ఏమ్మా! రాజా అమ్మాయిని పంపించమన్నాడట!' శివశాస్త్రి కంఠం విని ఉలిక్కిపడి లేచి కూర్చుంది. శివశాస్త్రి గది గడపలో నిల్చొని వున్నాడు.

'అవును పెదనాన్నా!' ముభావంగా జవాబిచ్చింది మాధవి. మాట్లాడాలని లేదు. కాసేపు వరాసంగా, ఒంటరిగా కళ్ళు మూసుకొని పడుకోవాలని వుంది.

'మగవాడు ఎలా పెంచుతాడు? పెళ్ళి చేసుకుంటున్నాడా?'

'లేదు.' అనబోయి 'నాకు తెలియదు' అనేసింది.

శివశాస్త్రి మాధవి ముఖంలోకి పరిశీలనగా చూశాడు. ముఖం బాగా వాడిపోయి వుంది. రాజారావు మాధవిని చేసుకోవటం లేదనీ అందుకల్లనే పిల్లను పంపించమన్నాడనీ అర్థం చేసుకొన్నాడు. తేలిగ్గా నిట్టూర్చాడు. ఆ మధ్య కొంత కాలంగా అతనికి వో దిగులు పట్టుకొంది. మాధవి పెళ్ళి చేసుకొని వెళ్ళిపోతే ఇల్లు గడవటం ఎలాగా అనే చింత పీడించసాగింది. శివశాస్త్రికి సంతోషాన్ని కలిగించిన విషయం ఏదో మాధవి తేలిగ్గా గ్రహించింది. శివశాస్త్రి చిన్నగా అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

ఛ! ఏం మనుషులు! పెదనాన్న, ఒకనాడు తను ఆ ఇంటికి రావటానికి ఇష్టపడని పెదనాన్న, ఈనాడు తను ఆ ఇంటిని వదలడం ఇష్టపడటంలేదు. తనే అతని బిడ్డయితే తన వివాహం గురించి ఆలోచించడా! అక్కయ్య పెళ్ళికోసం ఎంత గొడవ పడిపోయాడు? రాధ తన పెళ్ళి తానే స్వయంగనే చేసుకోగలదని బహుశా నమ్మకమేమో? రాధ అప్పుడప్పుడు తెచ్చిపెట్టే చిరుతిండ్లకు ఆశ పడుతున్నాడు. కూతురు ప్రయోజకురాలనుకుంటున్నాడు. తను మాత్రం వివాహం చేసుకోకుండా అలాగే వుండిపోతే చాలు పెదనాన్నకు. చీకూ చింతా లేకుండా తిని తిరగొచ్చును. ఎంత స్వార్థం!

తన జీవితం ఇలా వీళ్ళందరికోసం బలి అయిపోవాల్సిందేనా? తను ఎవరికీ అక్కర్లేదు. ఈ ఇంట్లో వాళ్ళకు తన సంపాదన కావాలి.

చిన్నతనంలో తల్లిదండ్రుల చల్లని నీడకు దూరం అయింది. యవ్వనంలో మొదటిసారిగా తనను ఆకర్షించి, ఆశలు చూపించిన మధు కూడా తనను వదిలేసి వెళ్ళిపోయాడు. ఏ ఆధారం ఆసరాతో తను మిగిలిన జీవితాన్ని నిశ్చింతగా గడపాలని అభిలషించిందో అదీ తనకు లభించలేదు. భగవంతుడు తనను ఎందుకింత దారుణంగా శపిస్తున్నాడు!

బావదగ్గరకు వెళితే! బావకు తన అసహాయతను తెలియజేసి ఇంత ఆసరా ఇవ్వమని అడిగితే? బావ మంచివాడు. ఒప్పక తనను స్వీకరిస్తాడు. కాని ... ఒకసారి అలా రాసిన బావదగ్గరకు తను వెళ్ళి ఏం అడగగలదు? చిన్నప్పటినుంచి తను ఎవర్నీ, నోరుతెరచి ఏదీ అడగలేదు.

తను బావను గౌరవించింది. మధును

ప్రేమించింది. మధు దగ్గరకే వెళ్ళి జరిగిందంతా చెబితే? పిచ్చి మధు! వట్టి ఉద్రేకం. బావతో తనను పార్కులో చూసి అపార్థం చేసుకున్నాడు. మధు ప్రవర్తనకు ఆశ్చర్య పడవలసిందీ, అభిమాన పడవలసిందీ ఏమీ కాదు. ఆ పరిస్థితిలో మధే కాదు ఎవరైనా అలాగే అర్థం చేసుకుంటారు. తను మాత్రం ఏం చేసింది. మధుతో మనస్సు విప్పి మాట్లాడిందా? తనూ అభిమాన పడిందిగా? తను అడక్కుండానే నాలుగు వేలు అప్పు తెచ్చాడు. అది తీర్చటానికి ఓవర్ వర్కు చేశాడు. అదంతా ఎవరి కోసం చేశాడు? తన కోసమే, కేవలం తన కోసమే. అలాంటి మధు వెళ్ళిపోగానే తను బావను చేసుకోవటానికి సిద్ధపడింది. అందుకే తనకు భగవంతుడు మంచి శిక్షే విధించాడు.

మధు ఎంత బాధపడి ఉండకపోతే తనకు ఒక్క ఉత్తరం అయినా రాయకుండా వుంటాడు! డబ్బు పంపించివిటే తన తండ్రి అడ్రసుకు పంపించమని పెదనాన్నకు అడ్రసు రాశాడు. ఆ అడ్రసు తన దగ్గర వుంది. మధు ఉద్యోగం మానేసి వుంటాడు. లేకపోతే తన అడ్రసు ఇవ్వకుండా తన తండ్రి అడ్రసు ఎందుకు ఇచ్చివుంటాడు. రేపే తను వాళ్ళకివ్వవలసిన డబ్బు పంపించివేస్తే? ఎలా?

మాధవికి ఓ ఆలోచన వచ్చింది. ఆ డబ్బు వంకతో తను మధువాళ్ళ ఊరికి వెళ్ళవచ్చు. మధు కనిపిస్తే అన్ని విషయాలూ అభిమానపడకుండా మాట్లాడుకోవచ్చు. అలా కాకపోయినా మధు ఎక్కడ వుండేదీ, ఎలా వుందీ తెలుసుకోవచ్చు.

తెల్లవారి పరమేశ్వర్ని బస్ ఎక్కించి తనూ మధూ వాళ్ళ ఊరికి వెళ్ళటానికి నిశ్చయించుకొంది మాధవి. అంతవరకూ బరువుగా వున్న మనస్సు కొంత తేలిక పడినట్లనిపించింది.

అప్పటికి బాగా పొద్దువాటారింది. గదిలో ఉక్కగా వుంది. అలా చల్లగాలికి ఎక్కడికైనా వెళ్ళాలనిపించింది మాధవికి. కాని ఓపికలేదు. లేచి ముఖం కడుక్కొని డాబా పైకి వెళ్ళి పచారు చేస్తూ ఒలో చూస్తూ, రోడ్డుమీద వచ్చేపోయే జనాన్ని



## అపరాధత

చూస్తూ కాలక్షేపం చెయ్యసాగింది. దూరంగా రాధ, ఎవరో యువకుని పక్కగా నడుస్తూ కనిపించింది. అలా నడిరోడ్డున ఎవరితోనో నవ్వుకుంటూ నడుస్తున్న రాధను చూస్తుంటే మాధవికి ఎబ్బెట్టుగా తోచింది. అంతకుముందు రాధతో కనిపించే యువకుడు కాదు అతను, రోజుకొక యువకునితో అలా సంచరించే రాధ జీవితం, ఎటు పోతుందో, ఎక్కడకుపోయి ఆగిపోతుందోననే దిగులు కలిగించింది మాధవికి. ఏమయినాసరే రాధను మంచి మార్గంలో పెట్టటం, ఆ ఇంటికి పెద్దపిల్లగా తన బాధ్యత వుంది!

ఆ యువకుడు, ఇంటికి అల్లంత దూరంలో ఆగిపోయాడు. ఇద్దరూ ఓ క్షణం ఏదో మాట్లాడుకున్నారు నిల్చొని. ఆ యువకుడు తన చేతిలో వున్న ప్యాకెట్‌ను రాధ చేతికిచ్చి, ఆమె చేతిని ఒకసారి తన చేతిలోకి తీసుకొని వదిలి వెళ్ళిపోయాడు. రాధ ఇంటికేసి నడక సాగించింది. మాధవికి కంపరమెత్తినట్లయింది. గబ గబా డాబా దిగి కిందకొచ్చింది.

రాధ చేతిలో ప్యాకెట్లతో లోపలకు వచ్చింది. మాధవిని చూసి చూడనట్లే నిర్లక్ష్యంగా లోపలకు వెళ్ళిపోయింది. మాధవి రాధ వెనకే గదిలో ప్రవేశించింది. రాధ చేతిలోని ప్యాకెట్ విప్పింది. ముచ్చటైన ధర్మవరం పట్టుచీర. మాధవి తెల్లబోయి చూసింది. రాధ చీర పెట్టెలో పెట్టి పెదవులపై నవ్వు ముల్లింది. గది గడపలో నిల్చొనివున్న మాధవిని వ్యంగ్యంగా చిట్లించుకొంది.

'రాధా!' కటువుగా వుంది మాధవి స్వరం.

'ఏం?' అన్నట్లు నిర్లక్ష్యంగా చూసింది రాధ మాధవి ముఖంలోకి.

'ఆ చీర ఎక్కడిది? అంత ఖరీదైన చీర కొనటానికి నీకు డబ్బు ఎక్కడనుంచి వచ్చింది?' మాధవి రాధ ముఖంలోకి తీక్షణంగా చూస్తూ ప్రశ్నించింది.

'ఏం నీకు చెప్పాలా?' స్వరంలో నిర్లక్ష్యానికి మాధవికి కోపం ఎక్కువయింది.

'అవును!'

'ఎందుకో తెలుసుకోవచ్చునా?'

'ఈ ఇంటికి నేను పెద్ద బిడ్డగా, నీకు అక్కగా...'

'ఓహో అలాగా? అంటే నేను నీ అదుపాజ్ఞలలో వుండాలంటావు?' వెటకారం పెదవి చివరా కసిగా అడిగింది రాధ.

రాధ స్వరంలోని తీవ్రతకు మాధవి కొంచెం వెనక్కు తీసింది.

'అది కాదు రాధా! నువ్వలా పురుషులతో విచ్చలవిడిగా తిరగటం ఏమీ బాగాలేదు. చూసేవాళ్ళు ఏమనుకుంటారు? వెళ్ళను నేనూ నా స్నేహితురాలూ సినిమాకు వెళ్ళి అక్కడా నువ్వే తయారు. ఇద్దరు మగవాళ్ళతో సినిమాకు వచ్చావు. నాకు తల కొట్టేసినట్లయింది. ఇంట్లో లేని వచ్చేశాను.'

'ఇంకా?' వ్యంగ్యంగా ప్రశ్నించింది రాధ.

'ఈ రకరకాల చీరలు నీకు ఎక్కడ నుంచి వస్తున్నాయి? ఇప్పుడు నేను చూడలేదనుకున్నావా? వాడెవడో కిటికీ చివరవరకూ వచ్చి నీచేతికి ప్యాకెట్ ఇవ్వడం చూశాను.'

'అయితే ఏమంటావ్?'

'కాస్త ఇంగితజ్ఞానంతో ప్రవర్తించమంటాను.'

'అలాగా? మధుతో నీవు షికార్లు కొట్టింది ఇంగిత జ్ఞానంతోనేనా? ఆ తర్వాత మధుకు మొండిచెయ్యి చూపించి బావతో పార్కులకు తిరగటంకూడ ఇంగిత జ్ఞానమేనా?'

'రాధా!'

'ఎందుకలా అరుస్తావు? నిజం మాటంటేనే! నేనేం తప్పుపనులు చెయ్యటం లేదు. పురుషులతో స్వతంత్రంగా తిరిగి సంచరించినంతమాత్రంచేత ఆడవాళ్ళు చెడిపోతున్నారనుకోవటం తమ అజ్ఞానాన్ని బయట పెట్టుకోవటమే. ఆడవాళ్ళు ఆడవాళ్ళా స్నేహంగా వున్నట్లూ, మగవాళ్ళా స్నేహంగా వున్నట్లు, మగవాళ్ళా మగవాళ్ళా—ఆడవాళ్ళా ఎందుకుండకూడదు? నీలా నాకు మగవాళ్ళంటే భయం లేదు! సంస్కారం అంటే అంతకంటే అంతు లేదు! నాకు ఆత్మవిశ్వాసం వుంది. నా ఇష్టం లేకుండా ఏ మగవాడూ నామీద చెయ్యి వేసి ధైర్యం చెయ్యలేడనే నమ్మకం

నాకుంది. మొగవాడు ఆడదాన్ని ఆమె ఇష్టంలేకుండా ఏదో చేసేస్తాడనే విష యాన్ని నేను నమ్మను.' రాధ ఆవేశంతో మాటలు పెగలక ఆగిపోయింది.

మాధవి ఆశ్చర్యంగా రాధ ముఖంలోకి చూస్తూ నిల్చుండిపోయింది.

ఓ క్షణం ఆగి రాధ మళ్ళీ అందు కొంది. 'నాకవన్నీ ఎక్కడనుంచి వస్తు న్నాయనీ, ఎవరిస్తున్నారనీ కాదూ నీ అనుమానం? కొందరు యువకులు నా చుట్టూ భ్రమరాల్లా తిరుగుతున్న మాట నిజమే. నా అనుగ్రహంకోసం నాకు రకరకాల బహుమతుల్ని ఇవ్వ టానికి పోటీ పడుతున్నారు. వాళ్ళందరు చూపేదీ నిజమైన నిష్కల్మషమైన ప్రేమేనని నేను భ్రమపడటం లేదు. వాళ్ళు నన్ను భ్రమపెట్టి తమకోర్కెల్ని తీర్చుకోవాలని చూస్తున్నారు. నేను వాళ్ళను మూర్ఖుల్నిచేసి నాకు కావాల్సిన వస్తువుల్ని సంపాదించుకుంటున్నాను.'

రాధను చిన్నపిల్లగానే ఊహించు కుంటూ వచ్చిన మాధవికి రాధమాటలు మతి పోగొట్టాయి. తెల్లబోయి చూడటం తప్పించి ఏమీ మాట్లాడలేక పోతుంది.

'ఒక విషయం గుర్తుంచుకో, నేను మార్గం తప్పి ప్రవర్తించాలనుకుంటే నన్నెవ్వరూ ఆపలేరు. నాకు కావాల్సిందీ, నేను మనసారా కోరుకొనేదీ నిర్భయంగా చెయ్యగలను. అనవసరంగా నామీద పెత్తనం చెలాయించటానికి ప్రయత్నిం చకు. నా వ్యవిషయాల్లో జోక్యం కలుగ జేసుకోకు. నేను ఇప్పటికే రచయిత్రిగా కొంత స్థానాన్ని సంపాదించు కున్నాను. నీకంటే నేను ఎక్కువ చదువుతాను. ఎక్కువ ఆలోచిస్తాను. నాకు నచ్చిన మార్గంలో నేను నడుస్తాను. నీలా ఏదీ తెల్చుకోలేక, నాకేది కావాలో నాకే తెలి యని పరిస్థితిలో నేను లేను.'

'ఏవిటర్రా అన్నాలకు రారేం? ఏంటి సేపు కబుర్లు!' అంటూ పరమేశ్వరి వచ్చింది.

మాధవి తృళ్ళిపడి వంటింట్లోకి నడి చింది. రాధ తువ్వాలూ, సబ్బుపెట్టె తీసుకొని బాత్‌రూంకేసి నడిచింది.

ఆ రాత్రంతా మాధవికి కంటిమీదకు కునుకురాలేదు. రాధ ఎంత ఎదిగిపోయింది? ఎన్నిమాటలు మాట్లాడింది? అలాంటి భావాలు రాధలో ఎలా ప్రవేశించాయో! రాధ సంధియుగంలోని స్త్రీకి ప్రతినిధిలా మాట్లాడింది. ఆమెలో ఏదో తుఫాను చెలరేగుతోంది. కసి కట్టలు తెంచుకుం టూంది. చివరకు రాధ జీవితం ఏమవు తుందో, తెగిపోయిన గాలిపటంలా గమ్య రహితంగా విహరిస్తున్న ఆమె జీవితం పటం చివరకు ఎక్కడపోయి వాలిపోతుందో! అది ముళ్ళ కంచెమీదయినా వాలవచ్చు లేక నందనవనం మీదయినా వాలవచ్చును. రాధ జీవితాన్ని గురించిన ఆలోచనలు మాధవి మనస్సును అమితంగా కలవర పెట్టసాగాయి.

రాధ అన్నట్లు నిజంగానే తనకేం కావాలో తనకే తెలియదు? అవును? ఇంతవరకూ తనకు మధు కావాలో, బావ కావాలో కూడా సరిగా నిర్ణయించుకోలేక పోయింది. అందుకే తను మధును...తనను అంతగా ఆరాధించిన వ్యక్తిని...తనకోసం ఎలాంటి కష్టాన్నయినా నవ్వుతూ భరిం చిన మధును ... తను తెలిసి తక్కువగా దూరం చేసుకొంది. తనకు నిజంగానే రాధ కున్నటువంటి ధైర్యం లేదు. తను తప్పక మధును వెతుక్కుంటూ వెళు తుంది. ప్రపంచంలోని ఏ శక్తి తనను మధునుంచి వేరు చెయ్యలేదు.

తెల తెలవారుతుండగా ఆలోచనలనుంచి నిద్రలోకి జారిపోయింది మాధవి.

*   *   *

శకుంతలను తీసుకొని పరమేశ్వరి బయలుదేరుతూ వుంటే మాధవి పిల్లను హృదయానికి గాఢంగా హత్తుకుంది. పెంచిన మమకారంలో మాధవి మనస్సు కకావికలైంది. కళ్ళలో నీరు సుళ్ళు తిరిగింది. 'అక్కా నన్ను క్షమించు, నీకు మాట ఇచ్చిన ప్రకారం నీ బిడ్డను నా బిడ్డగా చేసుకోలేని అసమర్థురాలను.' అంటూ శ్యామలకు మనస్సులోనే క్షమా పణ చెప్పుకొంది. శివశాస్త్రి భార్యను బస్‌వరకూ దిగబెట్టటానికి బయలు దేరాడు. మాధవికి అంతవరకూ కూడా వెళ్ళాల్సిన అవసరం కలగలేదు. పరమే శ్వరి పిల్లను తీసుకొని రిక్షా ఎక్కుతూ వుంటే మాధవి దిగాలుపడి గడపలోనే నిల్చుండి పోయింది. రిక్షా కదిలిపోతుంటే కన్నీటితో వీడ్కోలు పలికింది మాధవి. తీరా లోపలకు వచ్చాక ఇల్లంతా బావురు మంటూ బోసిగా, ఖాళీగా కనిపించింది. శకుంతలను దూరం చేసుకొన్న బాధ ఒక వైపూ, మధును దగ్గర చేసుకో బోతున్న ఆనందం మరోవైపూ, చీకటి వెలుగుల్లా ఆమె హృదయాన్ని చుట్టి వేశాయి.

మాధవి తన పెద్ద హ్యాండ్ బ్యాగ్‌ను తీసుకొని, అందులో ఒక చీరా, జాకెట్ పెట్టుకుంది. రాజారావు పంపించిన డబ్బు కవరుతో బ్యాగ్‌లో పెట్టుకొంది. బయటకు రాబోతున్న మాధవికి రాధ తన గదిలోకే వస్తూ ఎదురైంది. మాధవి



# అపరాజిత

ప్రశ్నార్థకంగా రాధవైపు చూసింది.

'శకుంతలను ఎందుకు అమ్మ తీసుకెళ్ళిపోయింది. బావ పంపించమన్నాడా?' కుతూహలం ఆమె స్వరంలో స్పష్టంగా ద్యోతకం అయింది.

'అవును!' మాధవి ముక్తసరిగా జవాబిచ్చింది.

రాధ వొక్షణం రాధ ముఖంలో గుచ్చి చూసింది. అక్కడ ఆమెకు ఏ భావమూ గోచరించలేదు.

'బావ పెళ్ళిచేసుకోవటం లేదా?'

'ఏమో నాకేం తెలుసు?' మాధవి విసుగ్గా అంది.

'నిన్నే చేసుకుంటా డనుకున్నాను?' రాధ స్వరంలోని వ్యంగ్యం మాధవికి చెంపదెబ్బ కొట్టినట్టయింది.

'రాధా! ఏమిటా వాగుడు?' అంటూ మాధవి విసురుగా బయటకు వెళ్ళిపోయింది.

అలా వెళ్ళిపోతున్న మాధవికేసి జాలిగా చూస్తూ రాధ నిట్టూర్చింది. ఆ సమయంలో రాధను మాధవి చూడగలిగితే, రాధకు తనమీద తను ఊహించుకొంటున్నలాంటి కసిగానీ, కోపంగానీ, ఏమీ లేదని తెలిసిపోయేది ఆమెకు.

మండుతున్న జ్యోతిమీద బుట్ట బోర్లించినట్టు అప్పుడే ఆకాశంలో వెలుగు ఆరిపోతూంది. దుమ్ము రేపుతూ వచ్చి ఆగింది బస్. బస్ దిగి కాలిబాటన ఊళ్ళోకి నడక సాగించింది మాధవి. మాధవికి ఆ పల్లె వాతావరణంలో వో వింత ప్రశాంతత గోచరించింది. పశువులు ఇళ్ళకు తిరిగొస్తున్నాయి. పిల్లలు గుంపులు గుంపులుగా చేరి రకరకాల ఆటలు ఆడుతున్నారు. దాదాపు అన్ని ఇళ్ళకూ వీధివాకిలికి ఇరువైపులా రాతి అరుగులు వున్నాయి. వయసు మళ్ళినవారు అరుగులమీద కూర్చొని వున్నారు. మాధవి, చిన్నతనంనుంచీ బస్తీలోనే పెరిగిన మాధవి, ఆ పరిసరాల్ని ఉత్కంఠతో పరిశీలిస్తూ నడుస్తూంది. పిల్లల దగ్గర్నుంచీ, పెద్దవాళ్ళవరకూ, వీధిలో ఎదురైన ప్రతి ఒక్కరూ, తనని వో వింత వస్తువును చూసినట్లు చూస్తున్నారనేది గ్రహించిన మాధవి తనలోకి తనే కుంచించుకుపోసాగింది. పమిట చెరగును భుజాలమీదగా కప్పుకొని, తల వంచుకొని గబగబా నడక సాగించింది.

ఊరు చౌరాస్తా చేరుకున్న మాధవికి ఎటు వెళ్ళాలా అనే సందేహం కలిగింది. తనను వో వింత జంతువులా చూస్తున్న వాళ్ళను 'ఫలానావారి ఇల్లు ఎక్కడ' అని అడగటం అంటే మాధవికి అభిమానంగా వుంది. అయినా తప్పదు అనుకున్న మాధవికి రచ్చబండమీద కూర్చొని వున్న కొందరు పెద్దలు తనకేసే చూస్తూండటం కనిపించింది. ధైర్యం చేసి రచ్చబండ దగ్గరకు వెళ్ళింది.

'ఏంమ్మా? ఎవరిల్లు కావాలి?' సందేహిస్తూ నిల్చున్న మాధవిని ఓ గుబురుమీసాల ముసలాయన ప్రశ్నించాడు. అతని కంఠంలో ఆశ్చర్యంతోపాటు ఆదరణకూడా నిండివుంది.

'పాపయ్యశాస్త్రిగారి ఇల్లు!' చిన్నగా గొణిగింది మాధవి.

'ఏ పాపయ్యశాస్త్రి? ఈ ఊళ్ళో ఇద్దరున్నారు?' అన్నాడు లంక పొగాకు చుట్ట తాలూకు పొగను గుప్పుగుప్పున వదులుతూ.

మాధవికి ఏం చెప్పాలో తెలియక మౌనం వహించింది.

'ఇంటి పేరేమిటమ్మా?' అన్నాడు లావుపాటి ముసలాయన.

ఇంటి పేరేమిటో మాధవికి తెలియదు. మధు 'వి' అని రాసేవాడు.

'వాళ్ళబ్బాయిపేరు మధు. హైదరాబాదులో ఉద్యోగం చేస్తూంటాడు. ఇంటిపేరు 'వి' అని రాసేవాడు.' అంది మాధవి చిన్నగొంతుతో జంకు జంకుగా.

ముగ్గురు పెద్దమనుషులూ ఒకరి మొఖాలు ఒకరు చూసుకొన్నారు. పెదవుల సందునుంచి చీల్చుకుంటూ సూర్యకిరణాలు వచ్చినట్లు, గుబురు మీసాల సందుల్నుంచి హాసరేఖలు ముందుకొచ్చాయి. గుబురు మీసాల తాలూకు పెద్దమనిషి ముఖంలోకి, అతని చిరునవ్వు 'అలా చెప్పు. అబ్బాయిని వెతుక్కుంటూ వచ్చిన పట్నం అమ్మాయివి అన్నమాట!' అని నిలదీసి అడిగింది అతని చిరునవ్వు. మాధవికి అక్కడ నిల్చోవాలంటే ఇరుగ్గా, ఇబ్బందిగా వుంది. అక్కడనుంచి పారిపోగలిగితే బావుణ్ణు అనిపించింది. తను ఇలా వచ్చివుండాల్సింది కాదనిపించింది.

'ఈ వీధినే వెళ్ళి రెండో సందు... కుడివైపు రెండోసందులో చివరి డాబా ఇల్లే మధుసూదనరావు ఇల్లు.' అన్నాడు వో వయసుమళ్ళిన పెద్దమనిషి.

'బతుకు జీవుడా' అనుకుంటూ మాధవి అక్కడనుంచి ముందుకు నడిచింది. ఆమె ఎంతవేగంగా నడుస్తున్నా ఆ పెద్దమనుషుల తాలూకు చూపులు తనను వెంటాడుతున్నట్లే అనిపించింది మాధవికి.

పల్లెటూర్లు స్వర్గసీమలని వింది. కాని తను కాలుపెట్టిన క్షణంనుంచే తనకు అది నరకసీమలా, చాలా ఇరుగ్గా అనిపిస్తూంది. చిన్నతనంనుంచీ బస్తీలోనే పెరిగి పెద్దై ఒక్కసారి పల్లెటూర్లో కాలుపెట్టిన వాళ్ళకు పల్లె వాతావరణం అలాగే అనిపిస్తుందో ఏమో?

**(ఇంకా ఉంది)**

### అన్నం వండే పద్ధతి

అన్నం అందరూ వండగలరు. కాని కొందరు పేస్టులా వండేస్తారు. కొందరు మేకుల్లా వండేస్తారు. మొదటిది చూడ్డానికి బాగుండదు. రెండోది తింటే కడుపునొప్పి! అన్నానికి పెట్టిన ఎసరు సలసల్లాడుతున్నప్పుడు ఓ స్పూను నూనె వేసి తరువాత బియ్యం కడిగి పోయాలి— అప్పుడే ఉడుకుతున్నప్పుడూ తరువాతాకూడా అన్నం విరవిరలాడుతూ చక్కగా ఉడుకుతుంది.




'బాబూ, లేమ్మా లే; యింతసేపు పడుకో కూడదు. అందరూ లేచిపోయారు.' విజయ దినచర్యలో వో భాగం కొడుకుని నిద్రలేపడంతో ప్రారంభం అయింది.

బద్ధకంగా కళ్ళు తెరిచాడు యెనిమిదేళ్ళబాబు. తల్లిని చూడగానే చిన్న చిరునవ్వొకటి విసిరి మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు, చిలిపిగా.

'లే బాబూ,' బుజ్జగింపుగా తల నిమిరింది విజయ. కొడుకు పుట్టి, కొంత యెదిగాక భర్తకి మేలుకొలుపు పాడినా పాడకపోయినా రోజూ పొద్దున్నే బుజ్జగించి బాబుని లేపాలని ప్రయత్నిస్తుంది. ఆ పని చెయ్యలేనని తెలిసినా తన ప్రయత్నం మాత్రం మానదు.

'నాన్నారు లేచారా ?' బాబు పక్కమీదే యిటూ అటూ దొర్లాడు.

'లేచి గంటయింది. వీళ్ళు కూడా పోసేసుకున్నారు. లే మరి.'

'డాడీ లేపితేనే లేస్తాను. నువ్వేం బాగా లేపవూ' అయిష్టత తెలియచేసాడు బాబు.

'తండ్రికి తగ్గ కొడుకువే' చిరుకోపం నటిస్తూ వెళ్ళిపోయింది విజయ.

బాబుని రోజూ వాళ్ళనాన్నే 'హలో గుడ్‌మార్నింగ్.' అంటూ లేపుతాడు. ఆ మాటల అర్థం బాగా తెలియకపోయినా ముఖం చింకిచాటంత చేసుకుని లేస్తాడు బాబు. వెంటనే శ్రీకాంత్ బుగ్గగిల్లి 'గుడ్‌బాయ్' అంటేనే బాబుకి తృప్తి. ఆ విధంగా ప్రారంభం అవుతుంది సాధారణంగా ప్రతి ఉదయం.

శ్రీకాంత్ పేపరు చదవటం అయ్యాక, బాబుని పిల్చి కొంతసేపు వొళ్ళో కూర్చోపెట్టుకుని కబుర్లాడతాడు. నాన్నగారి వళ్ళో కూర్చుని ఆయన చెప్పే సంగతులు వినటమంటే బాబుకి చాలా సరదా. ఆకాశంలో ఝామ్మని యెగిరిపోయే విమానం గురించి నాన్నగారు చెప్పే కథలు వింటూంటే, బాబుకి తనకూడా పెద్దవాడయిపోయి నాన్నారిలా వో బుల్లి విమానం నడిపెయ్యాలనిపిస్తుంది. వెంటనే అడిగేస్తాడు 'నాన్నా. నేనెప్పుడు మీ అంత అవుతాను' అని.

'బాగా బుద్ధిగా చదువుకుంటే, అప్పుడు' అంటాడు శ్రీకాంత్. అలాగే అన్నట్టు తలూపుతాడు బాబు.

'నాన్నా, మరేం, అప్పుడు నేను కూడా మీలాగే మాంచి టోపీ పెట్టుకుంటాను కదూ. అప్పుడించక్కా తెల్ల బట్టలేసుక్కుని మీకన్నా జోరుగా విమానం నడిపేస్తా' అంటాడు ఊహల్లో తేలిపోతూ.

'మరి నన్నెక్కించుకుంటావా?' శ్రీకాంత్ అడుగుతాడు.

'వో' కళ్ళెగరేస్తాడు బాబు తమా

# దేవుడు పిలిచాడు

షాగా.

'అమ్మనో?'

ఈసారి బాబు కొంచెం ఆలోచించి నట్టు కనిపిస్తాడు.

'వద్దు నాన్నా! అమ్మకి భయం' అంటాడు.

శ్రీ కాంత్‌కి కొడుకంటే చాలా యిష్టం. అసలు బాబుకి చిన్న వయసు నుంచీ తండ్రిదగ్గరే మాలిమి యెక్కువ.

శ్రీ కాంత్ యింట్లో వున్నంతసేపూ నాన్నా నాన్నా అంటూ తండ్రివెనకే తిరుగుతాడు బాబు.

సాయంత్రం బడినుంచి వచ్చేసిన బాబు అమ్మ చేసిన చేకోడీలు జేబులో నింపుకుని తాతయ్య దగ్గరికి పరిగెత్తాడు.

ఎప్పుడూ యేవో మందులు నూరుతూ, రంగురంగుల సీసాల్లో నింపుతూ కాలం గడిపే తాతయ్యని చూస్తే చాలా తమాషాగా వుంటుంది బాబుకి. జారిపోయే కళ్లద్దాల్లోంచి చూస్తూ మధ్యమధ్య వాటిని పైకి యెగతోసుకుంటూ చాలా విచిత్రంగా కనిపిస్తాడు తాతయ్య.

తాతయ్య గదినిండా యేవేవో వేరు ముక్కలూ, గాజు జాడీల్లో ఆకులూ యింకా యెన్నెన్నో వుంటాయి.

'ఒరేయ్, అది ముట్టుకోకు, యిది ముట్టుకోకు' అంటూ హెచ్చరిస్తూంటాడు బాబుని తాతయ్య.

'తాతయ్యా, తాతయ్యా' గదిలోకి గెంతుతూ గట్టిగా అరిచాడు బాబు.

చేస్తూన్న పనాపి కళ్లద్దాల్లోంచి వాలుగా చూసాడు ముసలాయన.

'మరేం. యివాళేమో! వో బుల్లి విమానం చూసాను తాతయ్యా దాని బుర్రమీద పెద్దచక్రం గిరగిరా తిరుగుతూంటే యెంత బావుందని?' నాన్నగారుంటారా అందులో?' అసలు బాబు ఈ ప్రశ్నని అమ్మనే అడిగాడు రాగానే. కానీ తనేం జవాబు చెప్పలేదు. చేకోడీలు చేస్తూ ఆ...ఊ...అంటూ సమాధానం యిచ్చింది. అలా జవాబు చెపితే బాబుకి నచ్చదు.

'అబ్బే, నాన్నగారు మరో విమానంలో ఉంటార్రా!'

'ఏం, యిందులో యెందుకుండరు తాతయ్యా' బాబు త్వరలో వదిలేరకం కాదు.

'నాన్నగారు యింకో పెద్ద విమానం నడుపుతారు, అందుకని.' బాబుకి యీ సమాధానం రుచించలేదు.

'ఏం, యిదెందుకు నడపరు? ఈ బుల్లి విమానం బావుంటుంది తాతయ్యా. నువ్వు చూసావా? అసలిది యెంత తక్కువ యెత్తులో యెగిరిందో!... మరయితే చక్రం దాని బుర్రమీద యెందుకుంది?' బాబు మనసులో దాగిన ఆలోచనలు ప్రశ్నల రూపంలో వచ్చేస్తున్నాయి.

చిన్నపిల్లలు ఒక్కోసారి మాటిగా అడిగే అమాయకపు ప్రశ్నలకి సమాధానం చెప్పలేరు తల నెరిసిన వాళ్లు. అలాంటప్పుడు తమ అసమర్థతని చికాకుతో కప్పిపుచ్చుతూంటారు. అలాగే తయారయింది. యిక్కడ తాతయ్య పరిస్థితి. బాబు వేసిన యీ ప్రశ్నకి యేమని సమాధానం చెబుతాడీయన?

'అబ్బబ్బ, నువ్వూ నీ ప్రశ్నలూ... తలా కావోలేదు, మీ నాన్నని అడుగు' అంటూ తెచ్చుకోలు విసుగుని ప్రదర్శించాడు తాతయ్య.

'నీకు తెలీదా అయితే' బాబు రెట్టించాడు.

తల అడ్డంగా ఆడించాడు తాతయ్య. నిరుత్సాహంగా బాబు వీధిలోకి నడిచాడు.

ఆకాశంలో హెలికాప్టర్ యెగురుతూ కనిపించింది. దాన్ని చూడగానే పోయిన వుత్సాహం పుంజుకుంది బాబులో.

'ఇవాళ, నాన్నగారిని దీని గురించి అడిగెయ్యాలి. నాన్నగారెంత మంచివారో! తాతయ్యకి తెలీని చెప్పి నాన్నకి తెలుసు కదా. అసలు తాతయ్యకి విమానాలంటేనే బోల్డు భయం!

'పెగిరంగా పెద్దవాడయిపోయి, యిలాంటి విమానాన్ని నడపాలి. దృఢంగా నిశ్చయించేసాడు బాబు కనుమరుగవుతున్న హెలికాప్టర్‌ని చూస్తూ.

'దాన్ని హెలికాప్టర్ అంటారు. అది గాలిలో పడిపోకుండా నించోగలదు. ఎక్కడపడితే అక్కడ ఆపచ్చు' శ్రీ కాంత్ హెలికాప్టర్ గురించి చెప్పాడు.

బాబుకి. అంతా బాగానే వున్నది కానీ ఒకా 'ఎక్కడ పడితే అక్కడ ఆపచ్చు' అనేదే బోధపడలేదు బాబుకి. 'మరయితే దాన్ని మనింటి డాబామీద కూడా ఆపచ్చా?' ఉత్సాహంగా అడిగాడు.

'ఓ' అన్నాడు శ్రీకాంత్.

బాబు కళ్లలో ఆశ్చర్యం తళుక్కున మెరిసింది. నాన్న చెప్పేమాటలు వింటూంటే బాబు హృదయం వుద్వేగంతో గంతు లేస్తూంది. అన్నింటికన్నా శ్రీకాంత్ ఆయన చెప్పిన మాట ఒకటి బాబులో కొండంత సంచలనాన్ని కలిగించాయి.

'రేపు నేను ఆ విమానంలోనే చాలా దూరం వెళ్తాను. నేను వచ్చేదాకా అల్లరి చెయ్యకుండా బుద్ధిగా వుండాలి మరి.'

# దేవుడు పిలిచాడు

అన్నాడు శ్రీకాంత్.

'అరే, నాన్నగారికి ఈ విమానం కూడా నడపటం వచ్చే! మరి తాతయ్య రాదన్నాడుగా. అయితే తాతయ్యకేం తెలియన్మాట.' బాబు నిశ్చయించేసాడు.

ఈ కొత్త హెలికాప్టర్‌నిగురించి రేపు బళ్లో అందరికీ చెప్పెయ్యాలి! బాబు మనసు రేపటికోసం తహతహ లాడింది. రేపు రానేవచ్చింది.

శ్రీకాంత్ చాలా ఉత్సాహంగా వున్నాడు. చూస్తూండగానే ఎయిర్ యిండియా వాన్ గుమ్మంముందాగింది.

'నాన్నా, మళ్లీ యెప్పుడొస్తావు?'

బాబు ప్రశ్నకి రెండ్రోజుల్లో వచ్చేస్తానని జవాబిచ్చాడు శ్రీకాంత్.

'అమ్మదగ్గర అల్లరి చెయ్యకూడదు తెల్సా! నువ్వు గుడ్‌బాయ్‌వని అమ్మ చెబితే నీకో మాంచి ప్రెజెంట్ యిస్తాను. సరేనా!' అన్నాడు. బాబు మంచి కుర్రాడిలా తలూపాడు.

శ్రీకాంత్ బాబుని యెత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు.

విజయ ఆనందంగా తండ్రీ కొడుకులని చూసింది.

'ఏం ప్రజెంట్ నాన్నా?' అడిగాడు బాబు.

'అమ్మకిచ్చి వెళ్తాను. నువ్వు చెప్పిన మాట వింటే అమ్మే నీకిస్తుంది.' శ్రీకాంత్ చిలిపిగా నవ్వుతూ లోనికివెళ్లాడు.

తనవెనకే వచ్చిన విజయని రెండు చేతులతో పెనవేసి దగ్గరగా లాక్కున్నాడు. ప్రేమగా హృదయంమీదకు వాలిపోయిన విజయ కళ్లలోకి చూస్తూంటే శ్రీకాంత్‌కి చాలా బావుంటుంది. ఆమె మెత్తటి పెదవులని సున్నితంగా ముద్దు పెట్టుకున్నాడు శ్రీకాంత్.

విజయ కళ్లలో రెండు కన్నీటిబొట్లు కదలాడాయి. చూపుడువేలుతో కంటికొన లద్దాడు శ్రీకాంత్. విజయ జీవితంలో సాధారణంగా కలిగే మధురమయిన మరపురాని ఘట్టాల్లో యిదొకటి. శ్రీకాంత్‌ని యెక్కించుకుని ఎయిర్‌యిండియా వాన్ కదిలిపోయింది.

రెండురోజులూ వేగంగా గడిచిపోయాయి.

'నాన్నగారు ఈ వాళే వస్తారు' అనుకున్నాడు బాబు. పక్కమీంచి లేస్తూనే నాన్నగారిని తల్చుకోగానే బాబులో ఉత్సాహం ప్రవేశించింది.

రోజూవచ్చి లేపే అమ్మకోసం బాబు కళ్లు వెతికాయి.

'అమ్మా' పిల్చాడు. జవాబు లేదు. మరోసారి పిలిచాడు. వీధి వరండావైపు నుంచి యెవరో యేడుస్తున్నట్టు వినిపించింది. భయంగా వుందా రోదన వింటూంటే. బాబువొళ్లు జలదరించింది. 7 భరాగా 'అమ్మా' అంటూ పరుగెత్తాడు.

బాబుకి, వెక్కి వెక్కి యేడుస్తున్న విజయ కనపడింది. ఆమె చుట్టూ పక్కింటివాళ్లూ, యెదురింటివాళ్లూ, తాతయ్యా... యింకా, చాలామందున్నారు. బాబుకి భయంగా వుంది.

అమ్మ యేడవటం యెప్పుడూ చూడ లేదు బాబు. రోజూ నవ్వుతూ యెదురయ్యే అమ్మ యెందుకిలా యేడుస్తున్నాదో అర్థంకాలేదు,

'అమ్మా' అంటూ హీనస్వరంతో తల్లిని చేరుకున్నాడు. ఎంతమంది ఓదార్చినా విజయదుఃఖం హెచ్చుతున్నదే కానీ తగ్గలేదు.

కొడుకుని చూడగానే గుండె లవిసేలా యేడుస్తూ బాబుని హృదయానికి హత్తుకుంది. మరోక్షణంలో విజయకి స్పృహ పోవడమూ, చుట్టుపక్కలవాళ్లు బాబుని దూరంగా తీసుకుపోవడమూ జరిగాయి.

జరిగేది చూస్తున్న బాబు ముఖంలో అతివేగంగా రంగులు మారాయి. ముందు బిక్కమొహంవేసి చివరికి యేడ్పు లంఘించుకున్నాడు.

ఆటు కొంతమంది తల్లిచుట్టూ మూగారు.

నిశ్శబ్దంగా రోదిస్తూ, మనవడిని వోదార్చటానికి తాతయ్య శతవిధాల ప్రయత్నిస్తున్నాడు.

ముందురోజ రాత్రి కళకళ లాడుతున్న యిల్లు వొక్క రాత్రిలో మహావిదారకంగా తయారయింది.

శ్రీకాంత్ విమాన ప్రమాదంలో మరణించాడు!

భార్యని, కొడుకుని, తండ్రిని వదలి మరోలోకంలోకి వెళ్లిపోయాడు. అతడిని దేవుడు పిలిచాడు.

రోజులు గడవటం దుర్లభంగా వుంది విజయకి. ఒక్కసారి దుఃఖం దిగమింగలేక యెవరూ చూడకుండా చాటుగా రోదించేది. ఇంత చిన్నవయసులో ఆమెకి తగిలిన యీ అఘాతంనుంచి తేరుకోటం యేమంత సులభం కాదు. రోజులు నిర్విరామంగా, నిర్వికారంగా సాగిపోతున్నాయి.

'అమ్మా, నాన్నెప్పుడొస్తాడు' అని ప్రతిరోజూ, క్షణక్షణం బాబు దీనంగా



ఆడుగుతూంటే విజయహృదయం జవాబు చెప్పలేక మూగపోయేది బాధగా. విజయకి తెలుసు మరణించిన శ్రీకాంత్ మళ్ళీ రాడని.

కానీ బాబు యింకా నాన్నగారు రపో మాపో వస్తారనే నమ్ముతున్నాడు. రోజు రోజుకీ బాబు గొడవ యెక్కువై పోతూంది.

ఇంత చిన్న వయసులోనే బాబు మనసులో చావు మొదలయిన భయంకర పదాలు గూడుకట్టుకోవటం విజయకి యిష్టం లేదు. కానీ యెంతకాలమని దాచటం ?

బాబు వాకరోజు తాతయ్య, అమ్మ చెప్పే కబుర్లు నమ్మలేదు. ఎలాగయినా నాన్నని చూసి తీరాలని పట్టుపట్టాడు.

నాన్న మరింక రాడని బాబు హృదయానికి సున్నితంగా చెప్పాలి.

'నాన్నగారు దేముడి దగ్గరికెళ్ళారు. ఆయనింక రారు' అతి కష్టంమీద చెప్పింది విజయ.

'ఏం ? ఎందుకు రారు ?'

విజయకి యేం సమాధానం చెప్పాలో తెలీలేదు.

'దేముడి దగ్గరకి వెళ్ళినవాళ్ళు రారు బాబూ, దేముడు వాళ్ళని మరి పంపడు.'

తాతయ్య బుజ్జగింపుగా చెప్పాడు.

ఎవరెన్ని చెప్పినా బాబు మనసులో యేదో అశాంతిగా వుంటూంది. ఆరోజు అమ్మ యేడ్చినప్పటినుండీ మళ్ళీ ఆమె కళ్ళలో వెలుగు నీ పెదవులపై చిరునవ్వునీ చూడలేదు బాబు. అమ్మ అలా గంభీరంగా వుండటం బాబుకి నచ్చలేదు.

'రోజు రోజుకీ బాబుకి నాన్నని చూడా లనే కోరిక బలంగా పాతుకు పోయింది. ఎన్నిసార్లు, ఎంతమందిని అడిగినా నాన్న దేముడి దగ్గరకి వెళ్ళాడనీ దేముడు వాళ్ళని పంపడని మాత్రమే జవాబు వచ్చేది.

దేముడెక్కడున్నాడో తెలీదు కానీ బాబుకి యెలాగయినా దేముడిని కల్సుకుని నాన్నారితో కబుర్లు చెప్పాలనీ ఆయన వళ్ళో కూర్చుని కథలు వినాలనీ వుంటూంది.

'అమ్మా దేవుడెక్కడున్నాడే ? నాన్నగారిని చూడాలనుందమ్మా, దేముడిదగ్గరికెలా వెళ్ళటం ?' బాబు వేసే ప్రశ్నల్లో అమాయకత్వంతో పాటు నాన్నగారంటే ఆ చిన్ని హృదయానికున్న ఆప్యాయత గోచరిస్తూంది.

విజయ బాబుని దగ్గరకి తీసుకుని ముద్దు

# దేముడు పిలిచాడు

నంగా కన్నీరు కార్చింది. కన్నీటికి అర్థం తెలుసుకొనే వయసు కాదు బాబుది.

'అమ్మా, యేడవకే, భయంగా వుంది' బాబు కంఠం బొంగురుపోయింది.

'ఛీ, వెధవ దేముడు. నాన్నగారిని పట్టుకు పోయాడు.' ఆ క్షణంలో ఆ చిన్నారి హృదయానికి కనిపించని దేముడి మీద కోపం వచ్చింది.

'అమ్మా, దేముడు చాలా చెడ్డవాడు కదమ్మా' బాబు కాంతిహీనమయిన తల్లి కళ్లలోకి చూసాడు. ఆ మాతృమూర్తి కళ్లలో కదలాడే భావాలనూ గ్రహించే శక్తి, వయసు బాబుకి రాలేదు. నాన్నని చూడాలన్న వాంఛ బాబు మనసులో అగ్నిశిఖలో దాగిన అగ్నిలా ప్రజ్వరిల్లుతున్నది.

* * *

టీచర్ బోర్డుమీద రాసిన రెండో ఎక్కం అందరూ పలకమీద యెక్కించుకుంటున్నారు. బుద్ధిగా.

'బాబు పలకమీద యేవేవో గీతలు గీస్తున్నాడు. అతని మనసు యేదో లోకంలో వున్న శ్రీకాంత్ చుట్టూ పరిభ్రమిస్తున్నది. పైలట్ దుస్తుల్లో శ్రీకాంత్ ఠీవిగా కళ్లముందు కదలాడినట్టు భ్రాంతి కలిగింది బాబుకి. అతని మనసు నాన్నాలంది మవునంగా, కనిపించని నాన్నని వినిపించని మనసుతో పిలుస్తున్నాడు బాబు.

'ఎందుకు బాబూ యేడుస్తున్నావు?' బాబు స్థితిని గమనించిన టీచర్ అడిగింది

ఏమని జవాబు చెబుతాడు బాబు? చొక్కాతో కళ్లు తుడుచుకుని తలవంచుకుని పలక నందుకున్నాడు.

ఆ చిన్నపిల్లాడి విచిత్ర ప్రవర్తన టీచర్‌కి అర్థంకాలేదు.

బడి వదలగానే ఆయాకోసం యెదురు చూసాడు బాబు. ఇంకా ఆయా రాలేదు.

'బాబూ' పిలిచినట్టయి వెనక్కి తిరిగాడు. చేతిలో సగం విరిగిన పలకతో, చింకి బట్టలతో గోపి [illegible]. గోపి [illegible].

'[illegible]' [illegible] అన్నాడు. గోపి [illegible] మీ 'అమ్మ [illegible]'

గోపి నోటినుంచి 'మా అమ్మ [illegible]... దేముడి దగ్గరకి వెళ్లిపోయింది.' అన్న మాటలు వచ్చాయి అప్రయత్నంగా.

బాబు కళ్లలో ఆశ్చర్యం తళుక్కుమంది.

'మీ అమ్మ దేముడిదగ్గర కెళ్లిపోయిందా? మా నాన్నకూడా వెళ్లాడే!' ఆశ్చర్యంగా అన్నాడు.

'మీ అమ్మ యెలా దేముడి దగ్గర కెళ్లింది?' బాబు కుతూహలంగా ప్రశ్నించాడు.

'ఏమో, నాకు సరిగ్గా తెలీదు. అదేదో విషం అనుందిట. అది తింటే చచ్చిపోతార్ట, అప్పుడు దేముడిదగ్గర కెళ్తార్ట! మా నాన్న చెప్పాడు.'

'దేవుడి దగ్గరకి దోవ చూపించాడు గోపి, తనకి తెల్సినట్టు. బాబుకోసం ఆయా వచ్చింది. బాబు ఆమెతో నడిచాడు. గోపీకోసం ఎవరూ రారు. కాని అతనూ యింటికి ముఖం పట్టాడు చింకి చొక్కాతో ముఖం తుడుచుకుంటూ.

విషం...చావు... దేముడి దగ్గరకి వెళ్లటం...గోపి చెప్పిన మాటలే పదేపదే బాబు మనసులో మెదలుతున్నాయి!

విషం తినేస్తే చచ్చిపోతారన్నమాట. అపుడు యించక్కా తను దేవుడిదగ్గర కెళ్లిపోవచ్చు. అక్కడ నాన్నగారుకూడా వుంటారుగా? బాబు దోవపొడుగునా దీని గురించే ఆలోచించసాగాడు.

ఆలోచనల్లోంచి తేరుకోకుండానే యిల్లు చేరాడు బాబు.

* * *

పలకా పుల్లా తీస్కొని బాబు తాతయ్య గదిలోకి నడిచాడు నెమ్మదిగా. సేపాలో దాచుకున్న వేరుముక్కలని నెమ్మదిగా నూరుతున్నాడు తాతయ్య.

బాబు తాతయ్య కెదురుగా కూర్చున్నాడు.

అతని కళ్లు అక్కడ జరుగుతున్న పనిని శ్రద్ధగా గమనిస్తున్నాయి.

'ఇదేమిటి తాతయ్యా' బాబు చూపుడు వేలితో తాత నూరుతున్న [illegible] చూపించాడు.

'[illegible] బాబూ, [illegible] నాకు' అన్నాడు [illegible].

'[illegible]!' నేను నూరి

గాను తాతయ్యా, బాబు మరింత దగ్గర కెరాడు.

'ఒరే, దూరంగా వెళ్ళు, చిన్న పిల్లలు దీన్ని ముట్టుకో కూడదు' గాభ రాగా కళ్ళు చిట్లించాడు తాతయ్య.

'ఏం?'

'ఎందుకేమిటి? యిది విషం!'

ఉలిక్కిపడ్డాడు బాబు. గోపీ వాళ్ళమ్మ యిది తినే దేవుడిదగ్గర కెళిపోయిందన్న మాట. బాబుకి గోపీ మాటలు జ్ఞాపకం వచ్చాయి.

'ఎందుకు తాతయ్యా మరి దీన్ని నూరుతున్నావు? యిది తింటే యేం?' ముసలతను చురుగ్గా జారిపోయే కళ్ళ జోడు సర్దుకున్నాడు.

'తింటే చచ్చిపోతారు. జడ్డి ప్రశ్నలూ నువ్వూ. ముందు నువ్వసలు దూరంగా వెళ్ళు' అన్నాడాయన చేస్తున్న పనాపి.

'చచ్చిపోవడమంటే ఏమిటి తాతయ్యా?'

తాతయ్యకి యెలా చెప్పాలో తెలీలేదు. చావడం అంటే దేవుడిదగ్గర కెళ్ళడ మన్నమాట' ఒరేయ్, నువ్వెళ్ళి ఆడుకో, నీ కవసరంలేని ప్రశ్నలూ నువ్వూ.' కసిరినట్టన్నాడు తాతయ్య.'

బాబు గదిలోంచి బయటకెళ్ళిపోయాడు బుద్ధిగా. కిటికీలోంచి తాతయ్య చేసేది గమనించసాగాడు.

ముసలాయన నూరుతున్నది నాక ఔషధం. ప్రాణం పొయ్యడానికి ఉపయో గించే ఈ మందుతో ప్రాణం తియ్యటం కూడా చాలా సులువే.

ముసలాయన మందుని చిన్న సీసాలో పోచి, దాన్ని జాగ్రత్తగా తన మందుల పెట్టెలో పెట్టాడు.

తాతయ్య యిల్లు కదలగానే బాబు మెల్లమెల్లగా అతని గదిలోకి వెళ్ళాడు.

విజయ వంటింట్లో వుంది.

మందుల పెట్టెలో దాచిన సీసా బాబు కంట పడింది.

కొండంత సంతోషం కలిగింది బాబుకి.

మెల్లిగా సీసాతో బయటకి నడిచి గది తలుపులు జారేసాడు.

వంటింట్లోకి తొంగి చూసాడు బాబు.

అమ్మ వంట చేస్తున్నాది.

బాబు దృష్టి గోడమీది నాన్నగారి పటంమీద పడింది. చిత్రంలో శ్రీకాంత్ హాయిగా నవ్వుతున్నాడు.

నాన్నగారి పటం చూస్తుంటే బాబుకి చాలా ఆనందంగా వుంది. నాన్న గారి పటం పక్కనే వున్న దేముడి పటం వైపు చూసాడు బాబు. దేముడు ప్రశాం తంగా నవ్వుతున్నాడు.

'నీ దగ్గరికి వచ్చేస్తున్నాను ... మా నాన్నని నా కిచ్చేయ్యి' బాబు మనసు దేవుడిని కోరింది.

బాబు సీసామూత తీసాడు. ఎర్రటి ద్రవం దీపం కాంతిలో మరింత యెర్రగా వుంది.

బాబు మనసులో భయం లేదు. తను చేస్తున్న పనేమిటో తెలియని వయస్సది. బాబుకి వొక్కటే తెల్సు. అదే, తన చేతిలో వున్నది తింటే దేముడి దగ్గర కెళ్ళవచ్చు. అక్కడ నాన్న వుంటాడు. అది చాలు బాబుకి.

సీసాలోని మందు ప్రశాంతంగా బాబు గొంతులోకి దిగిపోయింది.

మరోక్షణంలో—

బాబుకి తల తిరుగుతున్నట్టనిపించింది. చుట్టూ చీకట్లు క్రమ్ముతున్నాయి. కానీ...కానీ...ఆ మసక వెలుగులో దేముడు. ...నాన్న...కనిపిస్తున్నారు. నాన్న దేముడి వొళ్ళో కూర్చున్నాడు. బాబుని చూసి రమ్మంటున్నాడు.

బాబు నిల్చునే శక్తి కోల్పోయాడు. చేతిలోని సీసా జారి శబ్దం చేస్తూ, పగిలి పోయింది. బాబు వెంటనే నేలమీద పడి పోయాడు.

ఏదో పడిన చప్పుడు విని విజయ గబ గబా అక్కడికి వచ్చింది. చెదరిన గాజు ముక్కలు. కూలిపోయిన బాబూ, కనిపించాయి విజయకి.

'బాబూ' గాభరాగా కొడుకుని చేరింది.

బాబుకళ్ళు మూతలు పడబోతున్నాయి.

'అమ్మా' హీనస్వరంతో పిలిచాడు.

విజయ జరిగిందేమిటో గ్రహించలేక పోయింది. బాబుకి యేదో అయిపోతున్నా దని మాత్రమే తెల్సుకోగలిగింది. గట్టిగా యేడుస్తూ బాబు తలని ఒడిలోకి లాక్కుంది.

బాబుకి అమ్మ కన్నీరు మసగ్గా కని పించింది. అమ్మ యేడుస్తున్నాది. ఎందుకూ? తను దేముడిదగ్గరకి వెళ్తు న్నాడుగా. నాన్నగారిని కూడా తెచ్చేస్తాడు కదూ. మరెందుకు అమ్మ యేడుస్తుంది? ఏమో? 'అమ్మా ... విషం... నేను... నాన్నారు...'బాబు మరి పలకలేదు. అతని చిన్ని పెదాలమీద యెన్నటికీ మాయని చిరునవ్వుమాత్రం మిగిలిపోయిందివిజయకి. జీవితంలో మరేదీ మిగల్లేదు. పలకమీద అంతకుముందు బాబు రాసిన 'నాన్న' అనే అక్షరాలు మాత్రం మిగిలాయి.

అంతా అయాక యింటికొచ్చిన ముసలి తాత యీ దృశ్యంచూసి నిశ్చేష్టుడై పోయాడు.

అందరి హృదయాలనీ కరగించిన బాబు హాయిగా, చిరునవ్వుతో దేముడి దగ్గర కెళ్ళాడు. బాబుని దేముడు పిలిచాడు.





"పెత్తందార్లు"లో విజయనిర్మల, సంధ్యారాణి, శోభనబాబు.

<u>చిత్రసమీక్ష:</u>

# పెత్తందార్లు

'దున్నేవాడిదే భూమి' అన్న వివాదంపై నిర్మించిన జోతి సిసిండికేట్ వారి 'పెత్తందార్లు'లో గ్రామ జీవితాన్ని ప్రతిబింబింప చెయ్యాలనే ఉద్దేశ్యంతో—అక్కడి దౌర్జన్యాలని దురాగతాలని జనరంజకమైన సినిమాటకరణం చెయ్యడం ద్వారా నిర్మాతలు ఆశయాన్ని నెరవేర్చుకున్నారనే చెప్పాలి.

రెండు కుటుంబాలు ఒక చలన చిత్రానికి సరిపడిన వైరుధ్యాన్ని పెంచుకుంటాయి. మామూలుగానే ఒక మంచి, ఒక చెడ్డ. చెడ్డవాళ్ళు యింటి దుకుని, మరోనాలుగు తలకాయలు. వీరంతా కలిపి కథానాయకుడి నిస్వార్థ సేవల విలువని ప్రజలకీ ప్రేక్షకులకీ తెలియపరుస్తూ ఆ పాత్రధారి నటనని పొనపడతూ తమ దౌష్ట్యాన్ని నిరూపించుకుంటూ వుంటారు. పాపం పండినప్పుడు దుష్టశిక్షణ శిష్టరక్షణతో కథ సుఖాంత మవుతుంది. ఇది కేవలం ఇతివృత్తం మాత్రమే ఇందులో అనేకమంది జీవితాలు, వారి జీవన విధానాలు కలిపి కథని రసవంతంగా నడిపించాయి.

ఈ తరహా చిత్రాలు చాలా వచ్చినప్పటికీ 'పెత్తందార్లు' చిత్రంలో ప్రత్యేకత జనాన్ని బాగా ఆకర్షిస్తుంది. భారీ తారాగణంతో నిర్మించిన ఈ చిత్రంలో యన్. టి. రామారావు నటన ఒక విశేషాకర్షణ. యువజన నాయకుడుగా అతని కృషి ప్రజాదరణ పొందినట్టే యస్. వి. ఆర్. నటనకూడా ప్రశంసలనందుకుంటుంది. చక్కని సెంటిమెంటు కల ఒక ముఖ్యపాత్రలో సావిత్రి నటన ప్రేక్షకుల్ని బాగా అలరిస్తుంది. రామారావు జతగా విజయనిర్మల నిండయిన నటన కనబరచింది. పెత్తందారుగా నాగభూషణం నటన అద్వితీయం. చిత్రానికి నటుత్వాన్ని కూర్చే పాత్రల్లో ముక్కామల, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య ప్రతిభావంతమైన నటనని ప్రదర్శించారు. ఇతర ముఖ్యపాత్రలని రేలంగి, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, విజయలలిత, జ్యోతిలక్ష్మి మొదలైనవారు పోషించారు.

స్వార్థపరులైన పెత్తందార్లవల్ల గ్రామజీవితం ఎలా అల్లకల్లోలమై పోతున్నదో నిరూపించే ఈ చిత్రానికి ఎడ్ల పందాలు, పొట్టేళ్ల పోరాటం కొన్ని ఆకర్షణలు. సి. యస్. రావు దర్శకత్వం వహించిన పెత్తందార్లు సంగీతం సారథి కె. వి. మహదేవన్. కెమెరా జి. కె. రాము. రచన టి. పి. మహారధి. నిర్మాత యు. విశ్వేశ్వరరావు.

— సికరాజు

# జన్మదినోత్సవం

'మడిగుండాలు' 'ఉండమ్మా బొట్టు పెడతా' 'బంగారు పిచిక' 'మరో ప్రపంచం' - చిత్రంలో నటించిన కుమారి ప్రసన్నరాణికి 16 సంవత్సరాలు



ప్రసన్నరాణి

నిండాయి. మదరాసులో ఏప్రిల్ 27 న తన 17 వ జన్మదినోత్సవాన్ని జరుపుకున్నది.

కూచిపూడి నృత్యం, భరత నాట్యాలలో తర్ఫీదు పొందిన ఈమె తన నాట్య ప్రదర్శనల ద్వారా రు. 80,000 జాతీయ రక్షణ నిధికి ప్రోగు చేసింది.

ప్రస్తుతం కుమారి ప్రసన్నరాణి శ్రీ బాపు దర్శకత్వంలో నిర్మితమవుతున్న 'బాలరాజు కథ'లో ఒక ప్రముఖ పాత్ర ధరిస్తున్నది. (జె. వి.)

# ప్రభాకరరెడ్డి చేతుల్లో ఉన్న సత్యనారాయణ గుట్టు

ఏర్కాడు దగ్గర సత్యనారాయణకు ఒక పెద్దఎస్టేటు వుంది. ఆ ఎస్టేటు యొక్క కార్యభారాన్ని ప్రభాకరరెడ్డి నిర్వహిస్తుంటాడు. సత్యనారాయణకు ఒక్కగానొక్క చెల్లెలు వుంది. ఆమె సుగుణాలరాశి; అందాల అలివేణి! ఆమె పేరు రాధ అనబడే విజయనిర్మల! ఈమె హీరో కృష్ణను మనసారా ప్రేమించింది. ఆయన్నే నాథుడ్ని చేసుకోవా లనుకుంది.

ఒకరోజు రాధ (విజయనిర్మల) ఒంటరిగా వున్న సమయంలో ప్రభాకరరెడ్డి ఆమెతో ప్రేమపురాణం ప్రారంభిస్తాడు. అతడ్ని నానా మాటలు అని కోపంలో తన అన్నయ్య సత్యనారాయణ దగ్గరకొచ్చింది. హాలులో నుంచుని అన్నయ్యా, అన్నయ్యా అని పిలుస్తుంది. సత్యనారాయణ వేగంగా వస్తాడు. వచ్చి 'నువ్వామ్మా, ఏమిటి యిలా వున్నావ్, ఎందుకిలా వుడికిపోతున్నావ్' అని ప్రశ్నిస్తాడు. 'ఎందుకా, వాడు, ఆ దుర్మార్గుడు నన్ను పెళ్ళిచేసుకోమని నిర్బంధిస్తుంటే, వాడ్ని విదిలించుకునివచ్చాను నేను నీ చెల్లెల్నిగా. నను దిక్కులేని పక్షిని చేస్తావా? నన్ను రక్షించే భారం నీది కాదా?' అని ఆవేశంతో మాట్లాడింది, 'ఏమిటమ్మా, ఎవడమ్మ వాడు, ఏం చేసాడు, వాడి అంతం చూస్తాను' అంటూ సత్యనారాయణ రివాల్వరుతీసుకుని బయల్దేరబోతుంటే 'నేనే ఆ దుర్మార్గుడ్ని' అంటూ ప్రభాకరరెడ్డి వస్తాడు. 'యూ రాస్కెల్, గెట్అవుట్, యూ ఆర్ డిస్మిస్డ్— వెళ్ళిపో యిక్కడ్నుంచి. ఒక్కక్షణం వున్నావో, నేనేం చేస్తానో నాకే తెలియదు' అంటూ సత్యనారాయణ బెదిరిస్తాడు. 'నీ బెదిరింపులకు, అదిరింపులకు లొంగే ఘటాన్ని కాదు నేను. నీ గుట్టు నాచేతుల్లో వుంది' అంటూ ప్రభాకరరెడ్డి విషపు నవ్వు నవ్వుతూ వెళ్ళిపోతాడు. 'కట్' అన్నారు దర్శకుడు కుటుంబరావు; ఓ. కే అన్నారు కెమెరామెన్ లాల్. ఈ సన్నివేశం రవిచిత్ర వారి 'పగ సాధిస్తా'లో కనిపిస్తుంది. ఈ చిత్రం మే నెలలో పూర్ణా పిక్చర్స్ ద్వారా విడుదలవుతుంది. శ్రీ వై. వి. రావ్ నిర్మిస్తున్న యీ క్రయిం

## సినిమా

థ్రిల్లర్‌లో విజయనిర్మల, కృష్ణ నాయికా నాయకులుగా నటించారు.

* * *

'విధి బలీయమైనది; విచిత్రమైనది' అంటే పొరపాటు లేదనుకుంటా. ఎప్పుడు ఏది, ఎందుకు జరుగుతుందో ఆ జగన్నాథుడొక్కడికే తెలుసు. మనం కేవలం నిమిత్త మాత్రులం. ఒక్కొక్కరికి ఒక్కొక్కరకపు మనస్తత్వాన్ని ఆ దేముడు ఎందుకిస్తాడో మనకర్థం కాదు. 'సంఘసేవ, కార్మిక సంరక్షణ' అంటూ కట్టుకున్న భార్యకు, కన్నకొడుక్కు దూరమయిన ఒక తండ్రి; 'డబ్బు, హోదా, నలుగురిలో ప్రశంస' కావాలంటూ తాళికట్టిన భర్తను దూరంచేసుకున్న తల్లి; 'అన్నంపెట్టిన అన్నదాతకు అన్యాయం తలపెట్టిన అయిన బంధువర్గం', 'కాని వారిని కాలదన్ని, కాలచక్రంలో ఏకాకిగా తిరిగి తిరిగి కడకు కన్నకుమారుడి వాకిటికే వచ్చిన తండ్రి', 'విలువయిన భర్త లేని లోటును గుర్తెరిగి ఆ భర్త సాంగత్యమే శ్రీరామ రక్ష' అని వాపోయిన తల్లి, పిల్లల భవిష్యత్తును తీర్చి దిద్దడానికి తల్లి+తండ్రులు యిద్దరూ అవసరమే అని నిరూపించిన కుమారుడు'— ఈ విచిత్ర మానసిక ప్రవృత్తులు కల్గిన కథాపాత్రలనుగొన్న కుటుంబ



'పగసాధిస్తా'లో సంధ్యారాణి, సత్యనారాయణ



"ధర్మదాత"లో కాంచన, నాగేశ్వరరావు.

చిత్రమే రామవిజేతావారి 'తల్లి తండ్రులు' చిత్రం. ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడు, ప్రతివాడు ఎంతవరకు ప్రయోజకుడుగా వుండాలనే నగ్నసత్యాన్ని చాటిచెప్పే యీ చిత్రంలో తల్లిగా సావిత్రి, తండ్రిగా జగ్గయ్య, కుమారుడుగా శోభన్‌బాబు నటిస్తున్నారు. ఇతర ముఖ్యభూమికలను నాగభూషణ్, రేలంగి,

## సినిమా

రాజబాబు, అల్లు రామలింగయ్య, వాణిశ్రీ, విజయలలిత, సంధ్యారాణి, పుష్పకుమారి, విజయ ధరిస్తున్నారు, 'తల్లి తండ్రులు' చిత్రానికి పినిసెట్టి మాటలను, ఘంటసాల సంగీతాన్ని సమకూరుస్తున్నారు. శ్రీ కె. వి. ప్రభాకర్ నిర్మిస్తున్న ఆ చిత్రాన్ని శ్రీ బాబూరావు డైరెక్టు చేస్తున్నారు.

## స్త్రీ త్యాగనిరతిని చాటిచెప్పే చిత్రం

'భర్తే ప్రత్యక్ష దైవం' అనుకునే ఉత్తమ యిల్లాలు జానకికి ఆ భగవంతుడు అవిటి వాడయిన రఘును భర్తగా ప్రసాదించాడు. జానకి అగర్భ శ్రీమంతురాలు. రఘు గర్భదరిద్రుడు. ఆ దేముడు



"విప్లవం వర్ధిల్లాలి"లో కాంచన.

సిరిని లేమితో కలిపాడు. 'స్త్రీని దైవస్వరూపిణిగా, మాతృమూర్తిగా, ఓర్పుకు ప్రతిబింబంగా చిత్రించిన ఆ సర్వేశ్వరుడ్ని కూడా మనం నిందించే విధంగా ఆడజన్మను సృష్టించాడు. ఆడజన్మ ఎంత పవిత్రమయినదో, అంతభయంకరమయినదిగా కూడా. 'తన భర్త సుఖ సంతోషాలకోసం, ఆయన ఆరోగ్య ఆయుష్షుల కోసం ఒక స్త్రీ ఎన్ని కష్టాలనయినా ఎదుర్కోగలదు. చివరకు ఆమె

## సినిమా డైరీ

● ఎన్టీ ఆర్ ఎస్టేట్స్‌వారి "కోడలు దిద్దిన కాపురం" షూటింగు వాహినీలో జరుగుతోంది. రామారావు, జగ్గయ్య, సావిత్రి, వాణిశ్రీ, పద్మనాభం, సంధ్యారాణి, నాగభూషణం మరియు రేలంగిగార్లు పాల్గొన్న సన్నివేశాలను శ్రీ యోగానంద్ చిత్రీకరించారు.

● నవశక్తి పిక్చర్స్‌వారి షూటింగు శ్రీ సి. ఎస్. రావ్‌గారి దర్శకత్వంలో ప్రసాద్ స్టూడియోలో ఒకవారం రోజులు జరిగింది. రామారావు, వాణిశ్రీ, శారదలు పాల్గొన్నారు.

● అక్కినేని జెమినివారి కలర్ చిత్రంలో పాల్గొని, "దసరా బుల్లోడు" అవుట్‌డోర్‌కు పెదముద్ర గ్రామానికి వెళ్ళి, అక్కడ్నుండి మద్రాసుకు వచ్చి, కాశ్మీర్‌కు గాని కొడైకెనాల్‌కు వెళ్ళ ప్రయత్నాలను చేస్తున్నారు.

● శ్రీమతి జమున హైదరాబాదు నుండి ఏప్రిల్ 23 న మద్రాసు వచ్చి, 23 నుండి 28 వరకు "ఆడజన్మ" షూటింగులో పాల్గొని, 30 నుండి "బంగారుతల్లి"కి హాజరై, మే 6 నుండి 13 వరకు ఉత్తమచిత్ర వారి షూటింగులో [సారధి స్టుడియోస్] పాల్గొన్నారు.

● కుమారి వాణిశ్రీ నవశక్తి పిక్చర్స్, ఎన్టీఆర్ ఎస్టేట్స్, జెమిని షూటింగుల్లో ఏప్రిల్ 10 నుండి 29 వరకు పాల్గొని, ఏప్రిల్ 30 న "దసరా బుల్లోడు" అవుట్‌డోర్‌కు వెళ్ళి, మే 6న గోవా వెళ్ళారు.

● శ్రీ చలం నిర్మిస్తున్న శ్రీ రమణచిత్ర వారి చిత్రంలో కథానాయికగా జమున నటించడానికి అంగీకరించి, మే 11 నుండి కాల్‌షీట్లిచ్చింది.

# ఆంధ్రప్రదేశ్ వెల్ ఫేర్ ఫండ్, హైదరాబాద్.

తేదీ 30–4–70 వ తే॥ 8 గం॥కు నైజామ్ కాలేజీ ఆవరణయందు జరిగిన 11 వ రాఫిల్ డ్రా ఫలితములు

1. మొదటి బహుమతి: రూ. 2 లక్షలు టిక్కెట్ నెం. **N 068100**

2 రెండవ బహుమతులు: రూ. **40,000** ఒక్కొక్కటి టిక్కెట్ నెం. **O 778334 N722741**

3 మూడవ బహుమతులు: రూ. **20 000** ఒక్కొక్కటి టిక్కెట్ నెం. **O541721 N821997 L633914**

**104 వ బహుమతులు రూ. 5,000 ఒక్కొక్కటి, టిక్కెట్ నెం**

| | | | |
|---|---|---|---|
| ఎన్. 323209 | ఎం. 866767 | ఎన్. 778460 | ఎన్. 371230 |
| ఎన్. 249211 | ఎన్. 732214 | ఎన్. 118899 | ఒ. 710329 |
| ఎన్. 667310 | ఎల్. 111758 | | |

**40 5 వ బహుమతుల రూ 1,000 ఒక్కొక్కటి, టిక్కెట్ నెం.**

| | | | |
|---|---|---|---|
| ఎన్. 164335 | ఎల్. 087584 | ఒ. 080636 | ఎల్. 702964 |
| ఎల్. 643164 | ఎల్. 770437 | ఒ. 186485 | ఎల్. 374624 |
| ఎన్. 385918 | ఎం. 115897 | ఎన్. 724347 | ఎల్. 725231 |
| ఎన్. 662967 | ఎల్. 705375 | ఎన్. 307293 | ఎల్. 177244 |
| ఎన్. 567217 | ఎం. 184044 | ఒ. 281405 | ఎన్. 102161 |
| ఎం. 383770 | ఎల్. 310304 | ఎల్. 068'44 | ఎన్. 709224 |
| ఎల్. 309291 | ఎం. 346199 | ఎల్. 366332 | ఎన్. 570752 |
| ఎన్. 532458 | ఎం. 396801 | ఎల్. 595325 | ఎన్. 846839 |
| ఎల్. 352969 | ఎల్. 665246 | ఎం. 399773 | ఎన్. 300775 |
| ఎల్. 670559 | ఎం. 920344 | ఎన్. 066290 | ఎం. 300062 |

**100 6 వ బహుమతులు రూ. 500 ఒక్కొక్కటి. టిక్కెట్ నెం.**

| | | | |
|---|---|---|---|
| ఎం. 458562 | ఎన్. 555906 | ఎల్. 290705 | ఎన్. 885722 |
| ఎల్. 580960 | ఎన్. 065815 | ఎల్. 221875 | ఎల్. 758767 |
| ఎన్. 271046 | ఎం. 231047 | ఎం. 359002 | ఎం. 074465 |
| ఎన్. 260914 | ఎం. 939930 | ఎం. 913108 | ఎన్. 974798 |
| ఎన్. 808544 | ఎం. 469543 | ఎన్. 573892 | ఎన్. 021446 |
| ఎం. 026247 | ఎల్. 490680 | ఎల్. 422134 | ఎం. 001970 |
| ఎం. 007592 | ఎన్. 114686 | ఎన్. 795936 | ఎన్. 104254 |
| ఎన్. 710784 | ఎన్. 362334 | ఎన్. 766286 | ఎన్. 973964 |
| ఎల్. 403694 | ఒ. 535132 | ఎన్. 498197 | ఎం. 561207 |
| ఎన్. 521801 | ఎం. 260673 | ఎం. 211263 | ఎన్. 060539 |
| ఎన్. 461643 | ఎన్. 071955 | ఎం. 212381 | ఒ. 568449 |
| ఎం. 964955 | ఎల్. 273957 | ఎన్. 899060 | ఎన్. 047574 |
| ఒ. 267550 | ఎల్. 047014 | ఎన్. 018849 | ఎల్. 292804 |
| ఎల్. 593848 | ఎన్. 578365 | ఎల్. 299935 | ఒ. 829962 |
| ఎల్. 240485 | ఎం. 148258 | ఒ. 627445 | ఎన్. 523954 |
| ఒ. 527283 | ఎల్. 908010 | ఎల్. 670207 | ఎల్. 010022 |
| ఎం. 470018 | ఎల్. 729595 | ఎల్. 087096 | ఎన్. 076444 |
| ఎం. 250235 | ఎల్. 421987 | ఎం. 407565 | ఎల్. 397344 |
| ఎల్. 608210 | ఎల్. 168658 | ఎన్. 270718 | ఎన్. 083590 |
| ఎన్. 494400 | ఎన్. 597465 | ఒ. 671365 | ఎన్. 853606 |
| ఎం. 546784 | ఎన్. 213019 | ఎల్. 578483 | ఎల్. 512026 |
| ఎన్. 168793 | ఎన్. 398670 | ఎం. 195140 | ఎల్. 435043 |
| ఎం. 421288 | ఎన్. 079703 | ఎన్. 938015 | ఎల్. 938453 |
| ఎల్. 428469 | ఎన్. 527201 | ఎల్. 535478 | ఎల్. 715807 |
| ఎల్. 351476 | ఎన్. 486570 | ఎన్. 203047 | ఎన్. 375322 |

**200 7 వ బహుమతులు రూ. 100 ఒక్కొక్కటి. టిక్కెట్ నెం.**

| | | | |
|---|---|---|---|
| ఎన్. 807609 | ఒ. 278664 | ఒ. 032974 | ఎల్. 724588 |
| ఒ. 544046 | ఎల్. 211731 | ఒ. 173157 | ఎల్. 179639 |
| ఒ. 928834 | ఎన్. 910967 | ఎన్. 916415 | ఎల్. 411119 |
| ఎన్. 779106 | ఒ. 251653 | ఎన్. 676153 | ఎన్. 991695 |
| ఎన్. 224888 | ఎన్. 798611 | ఎం. 077563 | ఒ. 556843 |
| ఎం. 547603 | ఎన్. 637473 | ఒ. 502847 | ఎల్. 322749 |
| ఎం. 549177 | ఒ. 857132 | ఎల్. 197509 | ఎల్. 878290 |
| ఎల్. 378282 | ఎల్. 678304 | ఎన్. 024941 | ఎం. 247142 |
| ఎం. 238446 | ఎల్. 878581 | ఒ. 567076 | ఎల్. 427388 |
| ఎన్. 213938 | ఎం. 115831 | ఎం. 394859 | ఎన్. 846034 |
| ఎన్. 058957 | ఎం. 334105 | ఎం. 186534 | ఎన్. 331955 |
| ఎన్. 251259 | ఎం. 019641 | ఎం. 439823 | ఒ. 091869 |
| ఎన్. 919399 | ఎల్. 438951 | ఎం. 939512 | ఎల్. 069540 |
| ఎల్. 183535 | ఎం. 146081 | ఎల్. 910403 | ఒ. 176255 |
| ఎం. 905085 | ఎన్. 799108 | ఎన్. 043672 | ఎన్. 234705 |
| ఒ. 049889 | ఎల్. 204379 | ఎం. 265543 | ఎం. 945267 |
| ఎన్. 267073 | ఒ. 244633 | ఎం. 834602 | ఎన్. 745054 |
| ఎన్. 483706 | ఒ. 169728 | ఎం. 463426 | ఎల్. 311802 |
| ఎం. 824904 | ఎం. 147598 | ఎం. 038578 | ఒ. 498473 |
| ఒ. 035750 | ఒ. 502087 | ఎం. 313081 | ఎం. 403807 |
| ఎం. 242761 | ఎల్. 270148 | ఎల్. 337444 | ఎన్. 976431 |
| ఎం. 338823 | ఎం. 549081 | ఒ. 467127 | ఎల్. 311423 |
| ఒ. 624023 | ఒ. 625061 | ఎల్. 345100 | ఎల్. 686595 |
| ఎన్. 387781 | ఎన్. 812757 | ఎం. 506 [illegible] | ఎన్. 674262 |
| ఒ. 884287 | ఎం. 292607 | ఎల్. 8[illegible]3009 | ఎల్. 330195 |
| ఎల్. 331093 | ఎల్. 424979 | ఎన్. 833213 | ఎల్. 528353 |
| ఎల్. 513670 | ఎన్. 65 478 | ఎన్. [illegible]5814 | ఎన్. 608762 |
| ఎన్. 450286 | ఎం. 152229 | ఎల్. 663596 | ఎల్. 635268 |
| ఎల్. 532836 | ఎల్. 345169 | ఎల్. 368021 | ఎల్. 348681 |
| ఎల్. 131611 | ఎం. 938959 | ఎల్. 088900 | ఎల్. 717302 |
| ఎల్. 226023 | ఎల్. 580395 | ఎల్. 276905 | ఎన్. [illegible]77782 |
| ఎల్. 167807 | ఎల్. 710037 | ఎల్. 029306 | ఎల్. 055533 |
| ఎం. 885071 | ఒ. 740345 | ఎన్. 583531 | ఎల్. 263724 |
| ఎం. 351518 | ఎం. 903506 | ఎల్. 586744 | ఎల్. 291314 |
| ఎల్. 746238 | ఒ. 155201 | ఒ. 781511 | ఎల్. 321196 |
| ఎల్. 008579 | ఎన్. 602226 | ఒ. 265143 | ఎన్. 025302 |
| ఎల్. 539034 | ఎల్. 562655 | ఎన్. 938744 | ఎల్. 658090 |
| ఎం. 438406 | ఎల్. 710138 | ఎం. 142371 | ఎల్. 123339 |
| ఎల్. 663820 | ఎన్. 461370 | ఎన్. 083585 | ఎం. 323412 |
| ఎన్. 904218 | ఎల్. 702591 | ఎల్. 078277 | ఎల్. 748466 |
| ఎల్. 029556 | ఎల్. 460410 | ఎన్. 983527 | ఎం. 031786 |
| ఎల్. 406320 | ఒ. 012047 | ఎల్. 298156 | ఎల్. 752323 |
| ఎల్. 728963 | ఎం. 175600 | ఎల్. 695448 | ఎల్. 101443 |
| ఎన్. 797864 | ఒ. 584306 | ఎన్. 335821 | ఎల్. 169586 |
| ఎల్. 092108 | ఎల్. 074366 | ఎం. 035898 | ఎం. 515528 |
| ఎల్. 319423 | ఎల్. 132325 | ఒ. 897806 | ఎల్. 157632 |
| ఎల్. 208821 | ఎల్. 139328 | ఎల్. 294527 | ఎం. 668101 |
| ఎల్. 000526 | ఎల్. 735524 | ఎల్. 255807 | ఎల్. 425208 |
| ఎం. 535109 | ఎల్. 164648 | ఎల్. 172154 | ఎం. 100950 |
| ఎల్. 089506 | ఎన్. 153103 | ఎల్. 389174 | ఎల్. 141199 |

ఈ డ్రా ఫలితములు ప్రకటించుటలో యేదైనా తప్పులు ముద్రింపబడిన యెడల ఆంధ్రప్రదేశ్ వెల్ ఫేర్ ఫండ్ వారు అందుకు ఎంత మాత్రము బాధ్యులుగారు. ఆంధ్రప్రదేశ్ వెల్ ఫేర్ ఫండ్ ఆఫీస్ జారీ చేయు బహుమతుల పట్టీ మాత్రమే సరియైనది. అంగీకరింపబడగలదు. XII–వ రాఫిల్ — స్వాతంత్ర్య దినోత్సవ ప్రత్యేక కానుక. రు. 10 లక్షలు 3312 బహుమతులలో పంచిపెట్టబడును. టిక్కెట్ల అమ్మకం సాగిపోతూంది. అదన ఆకర్షణ— 1, 2, 3 బహుమతులు పొందిన టిక్కెట్లు అమ్మినవారికి 10% బోనస్ XIII వ రాఫిల్ టిక్కెట్లుగా చెల్లింపబడును. ఇతర ఆకర్షణీయమైన షరతులకు మరియు వివరములకు, ఏజెంట్లు ది ఆనరరీ శెక్రటరీ, ఆంధ్రప్రదేశ్ వెల్ ఫేర్ ఫండ్, లక్ష్మీభవన్, ఫతేసుల్తాన్ లేన్, నాంపల్లి, హైదరాబాద్—1 వారితో సంప్రదించవలెను.

**ఠాకూర్ వి. హరిప్రసాద్, ఆనరరీ శెక్రటరీ.**

**ఐశ్వర్యము మరియు అభ్యుదయము — ఆంధ్రప్రదేశ్ సంక్షేమ నిధి లక్ష్యము**



"ఆడజన్మ"లో జమున, హరనాథ్.

చెప్పగలదు' అనేది నగ్నసత్యాన్ని చాటి చెప్పే చక్కటి చిత్రమే విజయలక్ష్మి మూవీస్‌వారు నిర్మిస్తున్న 'ఆడజన్మ' చిత్రం. ఈ చిత్రంలో జానకిగా జమున నటిస్తున్నారు. ఆవిడ భర్త రఘుగా హరనాథ్ నటిస్తున్నారు. శ్రీ జి.వి.ఎస్. రాజు నిర్మిస్తున్న 'ఆడజన్మ' చిత్రానికి తమిడపాటి మాటలను, వేణు సంగీతాన్ని నిర్వహిస్తున్నారు. శ్రీ అయ్యన్ మూర్తి

## సి ని వా

దర్శకత్వంలో నిర్మితమవుతున్న ఈ చిత్రం 11 రీళ్ళు తయారైంది. చిత్రంలో కనిపించే ఇతర ప్రధాన పాత్రలను నాగభూషణం, గీతాంజలి, సత్యనారాయణ, రాజబాబు, మాలతి, జూనియర్ కాంచన పోషిస్తున్నారు. స్త్రీజాతి ఔన్నత్యాన్ని, త్యాగనిరతిని ప్రస్ఫుటించ



"అఖండుడు"లో భారతి, కృష్ణ.

చేసే ఈ చిత్రం ప్రతివారిని కన్నీట తడిపి, హృదయాన్ని కరగించ గల దనడంలో అతిశయోక్తి లేదు.

## మైసూరులో తయారవుతున్న తెలుగు చిత్రం

'మానాన్న నిర్దోషి' చిత్రాన్ని నిర్మించిన మహాలక్ష్మి మూవీస్ తమ రెండవ చిత్రంయొక్క షూటింగు కార్యక్రమాలను మైసూరు ప్రీమియర్ స్టూడియోలో ప్రారంభించారు. శ్రీ ఎస్. భావనారాయణ వ్రాసిన కథకు, పాలగుమ్మి పద్మరాజు సంభాషణలను సమకూర్చారు. మే 8 న షూటింగు స్టార్టు అయింది. ముఖ్య పాత్రలను టి. ఎల్. కాంతారావు, బాలయ్య, సత్యనారాయణ, రాజబాబు, రాజశ్రీ, విజయలలిత గార్లు పోషిస్తున్నారు. సంగీతాన్ని సత్యం, ఛాయను ప్రకాష్ నిర్వహిస్తున్న ఈ చిత్రం మూడు మాసాల్లో మీ ముందు వుంచ గలదని తెలుస్తోంది.

## రాజసులోచన నృత్యం

నటిగా, నాట్యగత్తెగా మీ అభిమానాన్ని చూరగొన్న శ్రీమతి రాజసులోచన 'పుష్పాంజలి' నృత్యకళా కేంద్రాన్ని స్థాపించి, తన బృందంతో వివిధ ప్రదేశాల్లో విభిన్న నృత్యప్రదర్శనాల నిచ్చి మెప్పించింది. ఆ మధ్య ఆమెకు రాజమండ్రిలో ఒక యాక్సిడెంటు జరిగింది. తొమ్మిది అడుగుల ఎత్తుగల స్టేజినుండి (ప్రొస్సు చేస్తూ) క్రింద పడింది. కాలు విరిగింది. ఆమెకు మళ్ళీ కాలు స్వస్థత వచ్చింది. ఇటీవల ఆమె 'ఆంధ్ర మహిళా సభ'లో భరతనాట్యం + కూచిపూడి నృత్యాన్ని అభినయించింది. ఆమె ప్రదర్శించిన ప్రతి ఐటమ్, ప్రేక్షకుల్ని మైమరపించింది.

## 'షియర్ ట్యాలెంట్'

పెద్దహీరోల ప్రక్కన ఎక్కువ చిత్రాల్లో నటిస్తున్న హీరాయిన్ ఎవరో తెలుసా? ఇంకెవరు. ఒకనాటి రత్న



"పచ్చని సంసారం"లో కృష్ణ, వాణిశ్రీ.

తలు అనుకొంటారని ఆ ప్రదేశాల్లో ప్లాన్ చేస్తున్నారు. ఏమయినా యీ సంవత్సరం చిత్రనిర్మాణం మందకొడిగా సాగుతుందనే చెప్పాలి. మన తెలుగు రంగానికి దర్శకుల కొరత, నాయికల కొరత, థియేటర్ల కొరత తీరేట్టు కనిపించడం లేదు. వస్తున్న కొత్తతారలకు బ్యాలెన్సు తప్పి, సర్వాధికారంగా ప్రవర్తించడం వల్ల, వచ్చినవాళ్ళు వచ్చినట్టే పోయే

## సి ని వహా

ధోరణులు కనిపిస్తున్నాయి. ఒక్కొక్క దర్శకునికి శక్తికి మించిన పని రావడం వల్ల, వాళ్ళు యే ఒక్క చిత్రాన్ని రక్తి కట్టించలేరేమో అనిపిస్తుంది. విడుదలకు సిద్ధమయిన చిత్రాలకు థియేటర్లు సకాలంలో దొరికే పరిస్థితులున్నట్టు కనిపించడం లేదు. తారలు తమ రేట్లను యిష్టం వచ్చినట్టు పెంచేస్తున్నారు. నిర్మాతకి సలహా యిచ్చే నటులుకూడా బయలుదేరారు. నిర్మాతలను తమకు భోజనం పెట్టే 'అన్నదాత'లుగా భావించడం మాని, వారిని త్రుణప్రాయంగా కొంత మంది చూడడం ప్రారంభించారు. మన వాళ్ళకు కథలు దొరికితే, నటీనటులు దొరకరు. నటీనటులున్నప్పుడు వారికి తగ్గ కథలు దొరకవు. ఈ రెండూ సమకూరినప్పుడు దర్శకుడు దొరకడు—యిదీ నేటి మన తెలుగు పరిశ్రమ. 'ఎవరికి వారే యమునా తీరే'—యిదీ మనవాళ్ళ ప్రవర్తన. 'పొరుగింటి పుల్లకూర రుచి'—యిదీ మనవాళ్ళ అభిరుచి.

* * *

'మహాప్రపంచం' చిత్రంలో శ్రీ నాగేశ్వరరావును సాధువు వేషంలో చూసిన మరుదినం హీరోను జెమినీ స్టూడియోలో కలిశాను. 'మీరు వివేకానందుడిగా చాలా బాగుంటారండీ' అన్నాను. 'ఎవరయినా తీసేవాళ్ళుంటే, నేను ఆ పాత్రను తప్పకుండా పోషిస్తాను. కానీ, కమర్షియల్‌గా అలాంటి కథలు తీ చెయ్యరనుకుంటా' అని చెప్పారు. మరి 'తుకారాం'పై మీ అభిప్రాయం ఏమిటని అడిగా. 'ఎప్పటికయినా 'తుకారాం'గా నటించడం ఖాయం' అన్నారు.

* * *

పురాణకథలను, భక్తిని ప్రబోధించే కథలను నిర్మించడంలో తనకొక ప్రత్యేకత వున్నట్టు శ్రీ పద్మనాభం పలుమార్లు నిరూపించుకున్నారు. శ్రీ పద్మనాభం 'భక్తతుకారం'ను నిర్మించే ప్రయత్నాలు చేస్తున్నట్టు తెలుస్తోంది. నేటి పరిస్థితులకు యిలాంటి కథల అవసరం యెంతయినా వుంది. కాబట్టి పద్మనాభంగారు 'తుకారాం'ను తప్పక నిర్మించగలరని ఆశించవచ్చు.



"పసిడిమనసులు"లో విజయలలిత, శోభన్‌బాబు.

## హాస్యనటుల జపాన్ ట్రిప్

నటుడిగా, దర్శకుడిగా, నిర్మాతగా ప్రజాభిమానాన్ని చూరగొన్న శ్రీ పద్మనాభం, అనతికాలంలోనే ప్రేక్షకుల అభిమాన హాస్యనటుడిగా గుర్తింపబడిన శ్రీ రాజబాబుగారు మే మూడవవారంలో

# పుస్తకాలు

## ఛాలెంజ్ అండ్ స్టాగ్నేషన్

రచయిత: చంచల్ సర్కార్, వికాస్ పబ్లికేషన్స్, 5 దర్యాగంజ్, అన్సారీరోడ్ న్యూఢిల్లీ —6. వెల: రు 12 లు.

మాటలూ, రాతలూ, ఒబ్బ ప్రసారంవల్లా, అచ్చుద్వారా మానవుల మధ్య సంసర్గానికి తోడ్పడుతాయి., సాంకేతికాభివృద్ధి జరిగిన కొద్దీ సంసర్గ సాధనాలు కూడా అభివృద్ధి చెందుతూ ఉంటాయి. రేడియో, టెలివిషన్, సినిమా ఇవన్నీ ఇటువంటి సాధనాలే. ఆధునిక జీవితంలో వీటి ప్రాముఖ్యత ఇంతా అంతా కాదు. మంచికయినా, చెడుకయినా ఇవే భవిష్యత్తులో ఎంతో ఉపయోగకరంగా ఉండగలవు. ఇది అందరూ గ్రహిస్తున్న సత్యమే.

భారతదేశం, బాగా వెనుకబడిన దేశం. కాని ముందుకెళ్లాలని ప్రయత్నిస్తున్న దేశాలలో ఒకటి. దీనికి తగిన ప్రయత్నాలు ఎటువంటి వివిధంగా జరుగుతున్నాయో చాలా మట్టుకు ఎందరికో తెలుసు. అన్ని ప్రయత్నాలకీ సహాయపడే ప్రయత్నం సంసర్గ సాధనాల ద్వారా జరిగే ప్రయత్నం. ఉద్బోధన ద్వారా, కేవలం సమాచార ప్రచారం ద్వారా ప్రజలలో కొత్త చైతన్యాన్ని, ఉత్సాహాన్ని తీసుకు రావటానికి రేడియో, టెలివిషన్, వార్తా పత్రికలు, సినిమాలు మొదలయినవి ఎంతో తోడ్పడుతాయి.

అయితే, భారత దేశంలో సంసర్గ సాధనాల వినియోగం ఎంతవరకూ జరుగుతోంది? చాలా తక్కువగా జరుగుతోందని సుప్రసిద్ధ పత్రికా రచయిత, ప్రస్తుతం 'ప్రెస్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా' డయిరెక్టర్ శ్రీ చంచల్ సర్కార్ అంటున్నారు. ఆధునిక యుగం సవాలుని మన సంసర్గ సాధన వినియోగం ఎదుర్కొనలేకపోతోందని అయన అంటున్నారు. 'ఛాలెంజ్ ఎండ్ స్టాగ్నేషన్' అనే వ్యాస సంపుటంలో భారతదేశంలో రేడియో, టెలివిషన్, ముద్రణ, సినిమా వీటి వినియోగం ఎంత తక్కువగా ఉన్నదో వివరించారు.

ఐక్యరాజ్య సమితివారి ఆర్థిక సాంఘికశాఖ [యునెస్కో] వారు అభివృద్ధి చెందే ప్రతిదేశంలోనూ ప్రతి 1000 మంది జనానికీ 100 దిన పత్రికలూ, 50 రేడియోలూ, 20 సినిమాసీట్లూ ఉండాలని అన్నారు.

భారతదేశంలో అంకెలు, దినపత్రికలు 13, రేడియోలు 17. [సినిమా సీట్లు ఒక లెక్కప్రకారం వెయ్యికి సుమారు 10 కూడా లేనట్లు తెలుస్తుంది.

టెలివిషన్ పాశ్చాత్య దేశాలలో అతి ప్రధాన స్థానం వహిస్తోంది. రాజకీయాలలోనే కాక విద్యాభ్యాసం విషయంలో కూడా టెలివిషన్ అతి ముఖ్యమయినది ఈ సంసర్గ సాధనం భారతదేశంలో అసలె బలహీనంగా ఉంది. దేశం మొత్తంమీద ఒకే నగరం [ఢిల్లీ]లో ప్రసారం ఉంది, 10,000 సెట్లకి తక్కువగా ఉన్నాయి

సంసర్గ సాధనాలని ఇంగ్లీషులో 'మీడియా ఆఫ్ కమ్యూనికేషన్' అంటున్నారు. భారతదేశంలో వాటి బలం అత్యల్పంగా ఉందని శ్రీ చంచల్ సర్కార్ మళ్లీ మళ్లీ నిరూపించారు ఈ వ్యాస సంపుటంలో. కొన్ని వ్యాసాలు ఈ వస్తువుకి సంబంధించినవి. కే. శే. కోటంరాజు రామారావు గురించి ఆకాశవాణి ధోరణి గురించి, పత్రికలలో ఉద్యోగాలు చేసేవారి సంరక్షణల కొన్నిటిని గురించి రాసినవి తక్కిన మరికొన్ని వ్యాసాలు. ఆధునిక జీవితంలో 'కమ్యూనికేషన్' లేక సంసర్గం ఎంత ముఖ్యమయినదో తెలుసుకోవాలంటే శ్రీ సర్కార్ వ్యాసాలు తప్పకుండా చదవ వలసినదే! [ఒ. వ.]

## గుళ్లోదేవుడు

కిష్టిపాటి వెంకటసుబ్బకవి విరచితమైన 'దీబగుంట వీరభద్రచరిత్ర'కి, నవలారూపం 'గుళ్లో దేవుడు' అన్నారు మున్నుడిలో రచయిత శ్రీచిటిబాబు ముద్దా.

దివ్యక్షేత్రమయిన దీబగుంట స్థలపురాణం కథని రచయిత చక్కటి శైలిలో రాశారు. పెద్దచ్చు చూసి చిన్నపిల్లలకోసం రాసిన పుస్తకంలా అనిపించినా దైవసంబంధమైన కథ అందరిచేతా చదివిస్తుంది. చిన్నచ్చులో వేసివుంటే పుస్తకంతోపాటు వెలకూడా తగ్గి అందరికీ అందుబాటులో ఉండివుండేది. 80 పేజీల పుస్తకం వెల రెండు రూపాయలు. ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, విజయవాడ. [కి. వి.]

## అదృష్ట రేఖ

రచన: శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి, ప్రచురణ: యం. శేషాచలం అండ్‌కో, మచిలీపట్నం., మద్రాసు., సికింద్రాబాదు. పేజీలు 243. వెల: రూ 2—00 లు.

ఇది సాక్షాత్తు సాంప్రదాయిక నవల. ఇందులో పత్యేకతల విశేషంగా ఏమీ లేవు పెళ్లిళ్ళ వ్యవహారాలు, కట్నాలు, సూటీ పోటీ మాటలు, ఎంత సేపటికి ఇవే వివరించారు. మొదట్లో పుస్తకం చదవడానికి ఆసక్తి కలుగుతుంది. కాని పోను పోను విసుగ్గా వుంటుంది. ఇటువంటి సమస్యలు ఇంకా దేశంలో వున్నయ్యా అనే ప్రసక్తి వదుపరుంకు రావచ్చు. మనస్సుల మారలేద కాబట్టి ప్రజలు పాత ధోరణిలోనే నడుస్తున్నట్టుగా చిత్రీకరించారు.

నడక చక్కగా వున్నా, పాత్రల చిత్రణ మరీ సామాన్యంగా వుంది వున్నది వున్నట్టుగా చిత్రీకరించాలంటే పుస్తకం పోకడ ఇలాగే వుంటుంది.

మధ్యతరగతి కుటుంబాలవార చదివి మంచి చెడుల తెలుసుకొని ప్రవర్తించడానికి అనువైన పుస్తకం. పెళ్లి సందర్భంలోను, అయిన తరువాత మనస్సు తత్వాల ఎలా పరిణమిస్తవో విపులంగా తెలియచేశారు.

## A Manual of Development Journalism

రాసినవారు: అలాన్ చాల్‌కీ. అచ్చువేసినవారు: వికాస్‌పబ్లికేషను —ఢిల్లీ.

రచయితలు, విలేఖర్లు పత్రికలకు వార్తలను, విశేషాలను ఎంత క్లుప్తంగా—వివరాలను వదుల కుండా —రాయవచ్చో తెలియ చేశారు. డొంక తిరుగుడు పద్ధతి మానివేసి సూక్ష్మంగా ముక్తసరిగా ప్రచురణలు చెయ్యటానికి ఎలా వీలవుతుందో వుదాహరణలతో వ్యక్తం చేశారు. అనవసరమైన మాటలను వాక్యాలన తొలగించాలన్నారు. పేజీలు 4,5 లో]

గణాంకాలు, బడ్జెట్టుకు పనికివచ్చే అంకెలు పాఠకులకి "బోరింగ్" లేకుండా ఎవ్విధంగా వాడాలనో స్పష్టీకరించారు. [పేజీలు 12,15] పదాలు తెలియ కుండా వాక్యాలో పడి చివరకు వాక్యానికి మెరుగు లేకుండా ఏవిధంగా పరిణమిస్తుందో తెలుసుకోవచ్చు. ఇంటర్వ్యూలను గురించి చక్కగా రాశారు. [పే40]

హిందూదేశ పరిస్థితులకు అనుగుణంగా ఈ పుస్తకం రాయబడ్డది. పత్రికాఫీసులవారు, రచయితలు, విలేఖరులు తప్పకుండా చదివి అవగాహన చేసుకుని పత్రికలకు ఇంకా మెరుగు దిద్ద వచ్చు.

—"సాధారణ"



Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press: 6 & 7 Thambu




తప్పక చూడండి!













జ్యోతి సినీ సిండికేట్ వారి

# పెత్తందార్లు

నిర్మాత
ఎ. విశ్వేశ్వరరావు B.Sc.; దర్శకత్వం సి.ఎస్.రావు B.A.(Litt).

సంగీతం: K.V.మహదేవన్., కెమెరా: G.K.రాము, రచన: T.P.మహారథి

ఆంధ్ర: జ్యోతి – నైజాం: ఉషా – సీడెడ్: జయలక్ష్మి – మైసూరు: సుధా చిత్రా

RAMDAS.K

JOTHEE